దేశీయనాటక గ్రంథమాల—ప్రథమ కుసుమము.

శ్రీ

# మహారాష్ట్రవిజయము.

చరిత్రాత్మక నాటకము.

ఇది

ముక్త్యాలపల్లి వాస్తవ్యుడైన

చక్రావధానుల మాణిక్యశర్మచే

రచించఁబడి

నరసాపురమున

కస్తూరి శివశంకరకవిచే

సుదర్శనీ ముద్రాక్షరశాలయందు

ముద్రించ బడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

1914 సం॥ రము.

వెల (రు0—12—0 కాపీరైటు)

# పీఠిక.

ఆర్యులారా!

ప్రస్తుత మాంధ్రపత్రికా కార్యనిర్వాహకులైన శ్రీయుత ఆవటపల్లి నారాయణరావుగారును బందరు వాస్తవ్యులైన శ్రీయుత కాతా శ్రీ రామశాస్త్రిగారును దేశచరిత్రముల రూపకములుగ వ్రాసిన ప్రస్తుత కాలమున ముఖ్యమైనధర్మమని నా కొకప్పు డుపదేశించుటచే మిత్రుల యందలి భక్తిచే 1 మహారాష్ట్ర విజయము,2 పద్మిని,3 పేష్వనారాయణరావు వధ,4 కృష్ణవిజయము,5 విక్రమార్క చరిత్రము లనురచియించి తొలుత నీమహారాష్ట్రవిజయమును ముద్రించి దేశీయనాటక గ్రంథమాలకు ప్రథమప్రసవముగ ప్రచురపరచితిని. మరియు నీనాటకమునకు మాతృకగా దీసికొనిన శివాజీచరిత్రమును రచించిన శ్రీయుత కొమర్రాజు వెంకట లక్ష్మణ రావుగారికిని గ్రంథమును నిర్దుష్టముగా సవరించి ముద్రించిన శ్రీసుదర్శనీ పత్రికాధిపతులైన కస్తూరి శివశంకర కవిగారికిని మనఃపూర్వక వందనంబు లొనరించుచున్నవాడను. ఇందేవేని దోషములున్నచో బండితులు దయయుంచి తెలిపిన ద్వితీయ ముద్రణమున దిద్దుకొందను- దీనికి శుద్ధపత్రికను జేర్చలేదు.

ఇట్లు పండితజనవిధేయుడు

చక్రవధానుల మాణిక్యశర్మ,

## ఈనాటకమునవచ్చు పాత్రలు—

### పురుషులు.

| | |
|---|---|
| సూత్రధారుడు | నటుడు |
| శివాజీ | శహాజీ |
| పాండురంగదత్తు | శంకరదత్తు |
| రుస్తుంఖాను | నేతాజీపాల్కర్ |
| ఏసాజీకంక్ | అబాజీ |
| ముల్లానాసుబేదారుడు | ప్రథమ తురుష్కుడు |
| ద్వితీయ తురుష్కుడు | బీజపురసుల్తాను |
| అఫ్జుల్ ఖాను | పంతాజీ గోపీనాథుడు |
| బాజీఘోరపడే | రామదాసు |
| మంత్రిమోరోత్రిమలపింగళే | సేవకుడు |
| ఖాతర్ ఖాను | చారుడు |
| అల్లీఖాను | బాలాజీ బాజీరావు |
| కాలేషా | శావాస్తెఖాన్ |
| బహాదరలీఖాన్ | వలీఖాన్ |
| ప్రథమ దుర్గరక్షకుడు | ద్వితీయుడు పిరంగోజీ నరసాళా |
| తృతీయుడు | పోలాద్ ఖాన్ |
| శంభాజీ | రామసింగు |
| షేక్ అలీసాబ్ | పఠాను |
| ఖానుసాహేబు- | |

### స్త్రీలు-—

| | |
|---|---|
| జిజాబాయి | యవనస్త్రీ |
| సోయెరాబాయి | చేటిక, |

### బ్రాహ్మణుడు—



చక్రవధానుల మాణిక్యశర్మ

శ్రీ

# మహారాష్ట్ర విజయము.

## నాంది.

చ. అతులిత సర్వ సౌఖ్యముల ♦ నందెడు ముప్పది మూడుకోట్ల దే
వతల స్వతంత్ర వృత్తి బల ♦ వంతముగా హరియించి వారిఁ బె
న్వెతలను ముంచు తారకుని ♦ పీచ మడంచి స్వధర్మమున్ గృపా
మతి నెలకొల్పు నా శివకు ♦ మారు ప్రభావము మిమ్ము బ్రోచుతన్

మఱియు,

ఆ. పూత చరిత లోక ♦ మాతయా సీతను
దస్కరించి నట్టి ♦ దనుజుఁ గూల్చి
జగ మకంటకముగ ♦ సలిపిన శ్రీరఘు
రాము శక్తి మిమ్ము ♦ నోముగాఁత.

(సభమీఁదఁ బూవుల జల్లి తెరవంకఁ జూచి)

ఆహా! రంగస్థల మెంత చక్కఁగా నలంకరింపఁ బడినది! సద్గుణానర్ఘ మణిమంచికా నిచయ పరిపూరిత హారి దంతులును గరబదరాయమాణ సకల కళా కలాపులును, ఆత్మీయ దేశభాషాభిమానమాననీయులును, కరుణాతరంగిత స్వాంతులును నైన యీ మహామహు లొక్కసారి యీ పరిషత్తు నలంకరించుటచే ధన్యుఁడ నైతిని. ఇఁక నీ వివేకి జన శిరోమణుల మనముల రంజింపఁ జేయుటకై మా నటుని బిలచి యోజించెదను. (తెరవంకఁ జూచి) బావా! ఒకసారి యిటు వచ్చెదవా?

నటుఁడు—(ప్రవేశించి) ఆర్య ! ఇదిగో వచ్చితి నేమియాజ్ఞ.

సూత్ర—ఓయీ !

ఆ. సావధానులైన • సభ్యులఁ దిలకించి
నాట్యవేత్తనైన • నన్నుఁ గాంచి
మంగళప్రదంబు • రంగస్థలముఁ జూచి
యాజ్ఞ యేమి యనుచు • నడుగ వలెనె.

నటు—చిత్తము. (ఆలోచన నభినయించును)

సూత్ర—ఓయీ ! ఏమి యట్లాలోచించుచుంటివి ?

నటు—ఆర్యా ! ఈ పండిత మండలి నెట్టి నాటక ప్రయోగమున రంజింపుదునా యని !

సూత్ర—అదియా నీ యాలోచన ? వినుము.

గీ. నిరుపమాన కవిత్వ ని • ర్నిద్ర కీర్తి
నిచయ చక్రావధాని మా • ణిక్యశర్మ
ప్రథిత వీరైకరస మహా • రాష్ట్ర విజయ
రూపకము జేసి యీయఁడే • రూఢి మెరయ.

నటు—ఆర్య ! మహారాష్ట్ర విజయ మనఁగా సమష్టిగా వినఁబడుచున్నది. దానికి నాయకుఁ డెవ్వఁడు ?

సూత్ర—గోబ్రాహ్మణాది సాధు హితైక జీవనుఁడైన ఛత్రపతి శివాజీ యని యెఱుఁగవా ?

నటు—

ఉ. దొంగల రేడతండు పలు • త్రోవలు దోచిన దుండగీఁడు వా
నిం గృతియందుఁ జేర్చుటయె • నింద్యము, దాని ప్రదర్శనంబు సే
యంగ హసింపరే బుధులు • హా ! కలవయ్యెనె సత్కృతుల్ ? సుధా
సంగతి మించు రూపక ర • సంబున గాక ముదంబు పుట్టునే.

సూత్ర—నీ వింకను బెడతోవనే తిరుగుచున్నవాఁడవు.

చ. మనుజులు కొంద రీ శివకు ◆ మారు ప్రభావ మెఱుంగ లేక య
య్యనఘుని జోరుఁ డంచుఁ గుటి◆లాత్ముఁ డటంచును రవ్వ జేసి సం
తసని కొదఁవయ్యెనే ప్రభ? య ◆ దార్థ మెఱింగిన సజ్జనుం డొకం
డును నిజ మిట్టి దంచు నెపు ◆ డున్ బ్రచురింప డొకో ధరాస్థలిన్.

నటు—అది పట్టి రవ్వ సేయుట కాదు, ఆతని చరిత్రము గ్రంథస్థమై యున్నది!

సూత్ర—ఆలాగున నా ! సరిసరి.

గీ. గ్రంథములనుండి సంత మా ◆ త్రమునఁ బిచ్చి
వ్రాంత లెల్లను గమనింప ◆ నీతు లగునె
కిట్టనట్టి వారల్లు తమ ◆ కీర్తి కంచు
మించుదానికి దోషము ◆ లెంచుచుంద్రు.

నటు—ఏమీ ! నే జదివిన వన్నియుఁ బిచ్చివ్రాంతలే యగునా! అట్లైన నా శివుని నిజమైన చరిత్రము వేరొండు గలదా !

సూత్ర—లేకేమి, వినుము.

సీ. అమృత వర్షపుధార ◆ లట్టుల జేసియ
చరితంబు లెవ్వడు ◆ కురిసె జగతి
నాంగిలే యాంధ్ర మ ◆ హారాష్ట్ర గీర్వాణ
కళలచే నెవఁడు ప్ర ◆ ఖ్యాతి గాంచె
విజ్ఞానచంద్రికా ◆ భిఖ్యఁబు గల గ్రంథ
మాలిక కెవఁడు సం ◆ పాదకుండు
రహిమించు శ్రీకొమ ◆ ర్రాజ వంశాబ్ధికిఁ
బార్వణ చంద్రుడే ◆ బ్రాహ్మణుండు

గీ. అట్టి వెంకట లక్ష్మణా ◆ హ్వయుఁడు పెక్కు
చరితముల గని శివరాయు ◆ సత్య చరిత

మును రచించి లోకమునకు ♦ ముదము గొల్పె
నదియె యథార్థవిత్కవి ♦ కరయ సఖుడ !

నటు—అట్లైన నీ రూపకమునే ప్రయోగించినచో లోకమునకు సత్య వీరచరితము వెల్లడి యగును.

సూత్ర—నిజము గనుగొంటివి. కాన, వేవేగ విరహిణీ గండస్థలంబులవలె వెల్లబారిన దెసలు గలిగిన యీ శారదాగమమును గూర్చి యొకసారి గానము సేయుము.

నటు—చిత్తము.

చ. ధరణిని బిండి చల్లిన వి♦ధంబున జంద్రిక లొప్పుచుండెఁ ద
స్కరతతి చౌర్య నిస్పృహ వ♦శంబునఁ జింతల పాలు చెందె రా
జ్యరమకు నై నృపుల్ సమర♦సన్నహనంబున నుత్సహించి రం
బరమున దూది పింజెలటు ♦ పాఱు నవారిగ శారదాభ్రముల్.

సూత్ర—బాగు ! నటుడా బాగు !

(తెరలో)

ఉ. పాప భయంబులేక మును ♦ బాలుఁడ నంచు దలంపకుండ నై
జాపుర దుర్గపాలకుఁడ ! ♦ శత్రులకున్ నను బట్టి యిచ్చితే
యో పశువా! దురాత్ముఁడ! మ♦హాగ్రరణస్థలి నిన్ను శస్త్ర సం
తాపితు జేయకుందునే య♦ధర్మము గాంచి శివాజి సైచునే.

సూత్ర—(ఆలకించి ఆశ్చర్యముతో) ఓయీ! మన మిక్కడ దర్శించుచుండఁగనే మన రంగ చంద్రుఁడు శివాజీ వేషంబు నభినయించుచు మొగలుల క్రౌర్యమును దలపోసికొని రౌద్రము గురియుచున్నాఁడు. మనమును మన భూమికలకై త్వరపడవలెను రమ్ము పోవుదము.

నటు—చిత్తము. (నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

శ్రీ

# మహారాష్ట్రవిజయము.

## ప్రథమాంకము.

(శివాజీయును జిజాబాయియు ప్రవేశింతురు)

శివా—

ఉ. పాప భయంబులేక మును • బాలుఁడ నంచు దలంపకుండ వై
జాపుర దుర్గపాలకుఁడ ! • శత్రులకున్ నను బట్టి యిచ్చితే
యో పశువా! దురాత్ముఁడ! మ • హోగ్రరణస్థలి నిన్ను శస్త్ర సం
తాపితు జేయకుందునె య • ధర్మము గాంచి శివాజి సైచునే.

జిజా—కుమార ! నిన్ను బట్టి యిచ్చుటకు మొగలులవద్ద లంచము సైతము గొనినవాఁడు సుమీ !

శివా—ఏమీ ! ఆరేండ్ల పసికూన నైనప్పుడు నన్ను బట్టి యిచ్చుటకు లంచముగూఁడ కొనిన వాఁడుగా ! ఆహాహా ! యెంత చెడు కాలము సంభవించినది.

చ. విలసదహీన ధర్మపద • విన్ [illegible]సియింపక పాప చింతకున్
దలఁగక క్రూరమానసము • నన్ జఠియించెదు లంచగొండి శుం
ఠలఁ గడు మోటువారిన క • టారుల ఖండన జేసి ధర్మమున్
నిలిపెదు కాలమెప్పు డవ • నిన్ జెలువారునొ సత్యవంతమై.

జిజా—నాయనా! అంతభాగ్యమునకు మన మెప్పుడైన నోచుకొందుమా!

శివా—అమ్మా! కాలమెప్పు డొకరీతిగా నుండదుకాని అంత కష్టపడి నన్ను చెరఁబట్టుటకు దగినంత వైరమేల మొగలులకు గలుగవలెనో.

జిజా—వత్సా! ముం దెప్పుడో మన మహారాష్ట్ర కులమునందు యవన విదారణ కారణుండగు శకకర్త యుదయించు ననియు హిందూదేశపుఁ బూర్వధర్మమును దిరిగి సంస్థాపింప నున్నాఁడనియు సూరిజనులు చెప్పుచుండుట వాడుకయై యున్నది. అది యాధారముగ నీ చర్యలనుబట్టి నీవే యా శకకర్తవని నిన్ను చెరగొని నారు.

శివా—(సంతోష శౌర్యములతో) తథాస్తు.

ఉ. అమ్మ! భవానికిన్ గృప ర♦వంతయుఁ గల్గిన యీ తురుష్క దా
ష్ట్యమ్మును రూపుమాపి నే♦ సంబుగ బ్రాక్తన ధర్మ మిమ్మహిన్
సమ్మతి నిల్పువాఁడ బటు♦ శౌర్యముతో శక కర్త నౌటకున్
గొమ్మలు వేయి కావలెనె♦ కూళల నొంచుట లెక్కలోనిదే.

జిజా—కుమారా! అట్టి వీర కేసరికిఁ దల్లినైన పిమ్మట గదా నేను ధన్యనగుట!

శివా—అమ్మా! తరువాత మనలఁ జెఱనుండి విడిపించిన వా రెవరు?

జిజా—నాయనా! ఆ మొగలుల కొలువులో మీ మాతామహుండగు జాధవరావు మొదలగు మహారాష్ట్ర వీరులు కల్పఱ్కరదామీ తండ్రిగారు నిన్నును నన్నును బహిష్కరించినారనియు నునవలన వారికెగ్గు పుట్టదనియుఁ జెప్పి మనలను విడపించినారు.

శివా—అమ్మా! అది యటుండనిమ్ము. నే నెన్నిసారు లడిగిన ను మా తండ్రిగారికి మనయందు కలిగిన యసూయతకు గారణము చెప్పక సమయము వచ్చినప్పుడు చెప్పెదనని నుడివితివి. కావున నిప్పుడు చెప్పెదవా!

జిజా—వత్సా! మీ తండ్రిగారు తొలుత గోంఢియు బీజపుర నవాబుల కొలువు సేయుచుండెనని వింటివి కదా! నాకుమాత్రమా సేవకవృత్తియం దిష్టములేదు. యవనులు రాజ్య మేలుచుండుటచే నే నిటుల బల్కితినని తలంచెదవేమొ. అటుల కాదు. ఏకాలమున కెవ్వరియం దీశ్వరశక్తి విజృంభించునో యది తెలుసుకొనుటకును విజృంభించిన దానిని తొలంగించుటకును మానవమాత్రులకు శక్యము కాదు. మ్లేచ్ఛ పరిపాలన మగుటచే విచారించుట లేదు కాని వారు పతివ్రతలకు బ్రాహ్మణులకు గోవులకు సాధువులకు జేయుచున్న ఘోరకృత్యములును హిందూమత ధర్మ విధ్వంసనంబును దలంచిన నెట్టి నరునకైన హృదయంబు బగ్గు మనక మానదు కావున దేశమాత గర్భమున బుట్టిన ప్రతిమనుజుండును సామర్థ్య మున్నయెడలం దమతమ మత ధర్మములను పునరుజ్జీవింపం జేసికొన బ్రయత్నింపవలెను. లేకున్న జీవచ్ఛవములపోల్కి బడి యుండవలెను కాని, విశేషించి వారి కొలువు గూడ గొల్చుట యెట్టి వెంగలితనము? మతము ప్రోవుటకన్నం బ్రాణములు ప్రోవుట లెస్సగదా! ఈ మతాభిమాన మా మ్లేచ్ఛులకు మాత్రము లేదా? ఎవరి మతము వారి కానందము కాదే.

శివా—అమ్మా! క్షత్రియోచితమైన మార్గమును బ్రదర్శించితివి.

జిజా—శివా! వినుము,

క. బ్రతికి నన్నాళ్లు స్వేచ్ఛగా • బ్రతుక వలెను
గాని కడుదుఃఖ భాజన • మైన యట్టి
నీచ సేవక వృత్తిని • నగడు కంటె
జీవనము సేయుటకు వేరె • త్రోవలేదె.

శివా—అమ్మా! పురుషార్థమైన నీతి నుపదేశించితివి.

జిజా—ఆయుష్మంత! ఈ నా యభిప్రాయ మెఱింగి తలఁప దగని పని బోధించితినని నాయం దసూయతకలిగి తుకాబాయియను నామెను పరిణయమై మీతండ్రిగారు నన్ను నిరాకరింప నే నచ్చటనే యుండిన వారి యాలోచనలకు భంగము కలుగునని యెంచి నిన్ను దోడ్కొని జీవించుటకై పుట్టినింటికి బోవుచుండ నీ యవనులచే నిట్టి యిక్కట్టులు సంభవించినవి.

శివా—ఆహాహా! అమ్మా! నా నిమిత్తమై యెన్ని యిక్కట్టులు పడితివో కదా! ఓరోరి ధర్మేతర వర్తనులార! యవనులార!

ఉ. ఏ పసిబాలుఁ జూచి జని • యించిన భీతి నధర్మ వృత్తి నే
లోపము లేనివాని చెఱ • లోపల బంధన జేసినారలో
యా పసివాఁడె ఘోర సమ • రాంగణ మందున నద్వితీయమౌ
రాపిడి కంబమై యవన • రాజుల కాయములన్ దొలంపడే.

జిజా—కుమార! మాతయైన భవాని నీకట్టి సామర్థ్య మొసంగుగాత!

శివా—తల్లీ! యధర్మ విధ్వంసనంబున కెవరు సాయపడకుందురు.

జిజా—నాయనా! అట్లయిన స్వధర్మమును నిలిపెదవని నేను నిశ్చయముగా తలంచెద. హైనవార లందరు పడుచున్న పాట్లు జూచిన

నిజమైన మానవునకు మనం బెరియక మానదు,

శివా—అమ్మా ! యీ తురుష్క ప్రభుత్వమంత లోకవిరుద్ధమై యధర్మ ప్రవర్తనముగా నున్న దిగా !

జిజా—వత్సా ! నే నేమని చెప్పుదును ! వినుము.

సీ. మాన భంగము సహింపక సాధ్వు లగ్నిలో
నుఱికి మ్రగ్గుచు నుందు రొక్కచోట
అంబా యనుచుఁ జూలు టావులార్వఁగఁ బట్టి
సురియలఁ గోయుచుం దు రొకచోట
కుక్కమాంసము నోటఁ గ్రుక్కి మొఱ్ఱోయను
భూసుర వరులయే డ్పు లొకచోట
ప్రతికూల జనుల జం పఁగఁ బారుచున్న మ
హోగ్ర రక్తపుగాల్వ లొక్కచోట

గీ. చితవధ నిల చెల్లిన శిరము లొకట
విటపులకు వ్రేలఁ గట్టిన పేగు లొకట
గలిగి మందర మథితమా జలధి పోల్కి
సంక్షుభితమయ్యెను మహారాష్ట్రంబు పుత్రా !

శివా—శివశివా ! (చెవులు మూసుకొని) అన్నన్నా ! ఎంత కష్టము.

ఉ. అక్కట ! యెట్టికర్మఁ జెవు లార వినంగ దటస్థ మయ్యె నే
నక్కుటిలాత్ము లైన జను లందర బట్టుక తచ్ఛిరంబులన్
వ్రక్కలు చేసి దేశపు భ రంబును బాపెద దేశ పుత్రులన్
గ్రక్కున బ్రోచువాఁడ నటు కామి నధర్మము గాంచి సైతునే.

జిజా—నాయనా ! దీర్ఘాయుష్మంతుఁడవు గమ్ము. నిష్కారణ

ణాము జనుల బాధించు క్రూరుల యెడ జూపవలసిన శూర లక్షణ మ యేనోయి తండ్రీ!

శివా—అమ్మా! నందియ మేల.

ఉ. ఏలరె పూర్వమందుఁ గొన • రేంద్రులు ధారుణి ధర్మబుద్ధిమై
బాలుర బ్రోచు రీతిఁ బ్రజఁ • బాలన సేయరె ప్రేమతోడ నీ
లీల జనాపకారిత మ • లీమస వృత్తి జరించిరే భయం
జేల మదీయ కార్యమున • కీశ్వరి తోడయి యన్నుఁ గావదే.

జిజా—కుమారా! ఇపుడు నేను చెప్పినందువలన జనించిన యుద్రేకము వలన పలుకుటచే నగునది కాదు. మిగుల యోచించి ప్రాణములపై నాసవదలి సిద్ధము కావలెను.

శివా—అమ్మా! మీరు చెప్పినదెల్ల నిక్కువంబె.

సీ. తాతగారైన జా • ధవరావుగారు ని
ష్కారణంబుగ నట్టి మో • గలులగలసె
నల తండ్రియైన శ • హాజీ మహారాజు
బీజపురాధీశు • ప్రేమ గొలిచె
నన్న శంభాజియు • నలవడి తండ్రితో
గలిసి తురుష్కుల • గొలుచు చుండె
వసుధ మహారాష్ట్ర • వంశజు లెల్లరు
నైకమత్యము లేక • చీకు వడిరి
గీ. మా మహారాష్ట్ర కులమభి • మాన ముడిగి
సేవకులవృత్తి తురకల • జేరియుండె
నకట! నా కొక్కఁడైనన • హాయ పడఁగ
లేడు మన ధర్మమెట్లు కా • పాడ గలనో.

జిజా—నాయనా! నీ తలంచిన కార్యమునకు భగవతి సహాయమే కాని తమ యాత్మలను సైతము దాస్యవృత్తియందు ముంచి తా మెవరో యెఱుంగక తమకు గలిగియున్న పూర్వపు సామర్థ్య మెఱుంగక ప్రస్తుత క్షీణదశ నెరుంగకయున్న మీ తండ్రిగారు గాని మరి యొకరుగాని నీకు సహాయపడుట స్వప్నవార్త.

(అంతట శహాజి ప్రవేశించును)

శహాజి—ఇదే నా ప్రేయసి! జిజా కుమారుండైన శివాజీ తో యేదో సంభాషించు చున్నది. సమీపించెదను. (అట్లు చేయును)

జిజా—(లేచి) నాయనా! శివా! అదె మీ తండ్రిగారు విచ్చేసినారు. నమస్కరింపుము.

ఇద్దరు—(నమస్కరింతురు)

శహా—ప్రాణేశ్వరీ! దీర్ఘాయుష్మతీభవ! కుమార! చిరంజీవివై వర్ధిల్లుదువుగాక. ప్రాణేశ్వరి! సుఖంబున నుంటిరిగదా?

జిజా—సాధూ! దేవరవారి కటాక్షమువలన సుఖముగానే యుంటిమి. ఆయుష్మంతుడగు శంభాజికిని చెల్లెలు తుకాబాయికిని సేమముకదా?

శహా—ప్రేయసీ! సేమముగనే యున్నవారు. తుకాబాయిని పెండ్లి యాడితినని కళంక మొందకుమా!

జిజా—ఆర్యా! మీయీ దాసురాలావిషయమై యెప్పుడును జింత నొందదుకదా?

శహా—వత్సా! శివకుమార! నీ సోదరుండు శంభాజి కొన్ని జాగీలను పని జూచుచుండెను. నీవును నందుల కర్హుండ వయితివి. కా

వున నాతోడవచ్చి కొన్ని జాగీలు విషయమై పని చేయుచుండిన నీకు ముందు గొప్ప యుద్యోగము కాగలదు.

శివా—తండ్రీ! నన్నెవరియొద్ద కొలువు గొలువుమను చున్నారు.

శహా—బాజాజీ! ఏ మహారాజు కరుణచే మనకు నైజాము శాహిలోని జాగీలన్నియును కర్ణాటకము రాజ్యములోని కోలారు బంగలూరు, బారాకోట, బాలాపూరు, శిరకటము మొదలగు జాగీరు లన్నియు సంభవించెనో అట్టి బీజపూరు నవాబువద్ద.

శివా—తండ్రీ! తమరెన్ని జాగీరుల లెక్క పెట్టినను నేను మాత్రి మా గోబ్రాహ్మణ హింసకుల కొలువు గొలువజాల,

శహా—(తనలో) తల్లి యుపదేశము బాగుగ దలకెక్కినట్లు లున్నది. (ప్రకాశముగా) మఱేమి చేసెదవు.

శివా—

ఉ. పౌరుషమున్న దుష్ట నర ♦ వర్గము సంహరణంబొనర్చి సొం
పార మరాట రాజ్యమును ♦ బాలన జేసెద మీరుమెచ్చ దో
స్సారము లేకయున్న వ్యవ ♦ సాయము జేసెద నంతెకాని యా
క్రూర తురుష్కులన్ గొలువ♦గూఢిగ నమ్మ్రుడు నెమ్మనంబునన్

జిజా—(తనలో) నా యుపదేశము నా కుమారుని హృదయ ఫలకమునందు గాఢముగ నాటుకొని నందులకు నా కెంతయు సంతోషకరముగా నున్నది. వత్సా! వీరకేసరి వగుదువుగాక.

శహా—ఆహా! ఇతని పల్కులు నాకు వ్యతిరేకములై నను వినుటతోడనే నవ్వు వచ్చుచున్నది. నాయనా! శివకుమార! నీవు తలంచిన కార్యము కర్తవ్యమేకాని మన ముందుల కిప్పుడు అపూర్వల

ము కావేూయి.

శివా—తండ్రీ! మీకీ విషయమున పెద్దత్రోవ దొరకు చున్నారు.

గీ. అవని నేలుదు రనుచు నీ ♦ యవన పాల
ములను వ్రాసియు మన మొగం ♦ బులను వ్రాయ
లేదె ధీరత దానికి ♦ కాదె మూల
మిట్టి సంకల్ప దారిద్ర్య ♦ మేల తండ్రి.

శహా—వత్సా! యుద్ధమన నెట్టిదో యెఱుంగవు గనుక నట్లు పల్కుచుంటివి.

సీ. జనరి కృతాశాంత ♦ ఫళఫళ ధ్వనులతో
వెడలు ఫిరంగిగుం ♦ డ్లోడలు గాల్ప
కాలపాశోపమ ♦ కరవాల రుచులు క
న్నులకును మిరుమిట్లు ♦ గొలుపుచుండ
కరమున నినుప రో ♦ కళ్లచే వైరుల
మస్తకంబుల డుల్చు ♦ హస్తు లడర
కరకు గత్తులచేత ♦ నరుకులాడుచు నుండు
భయదమైన పదాతి ♦ వర్గ మెసఁగ
గీ. రుధిర మేరుల బారు శ ♦ త్రుకుల సంకు
లంబయిన యట్టి యుద్ధ రం ♦ గంబు కాని
పిల్ల లాటలు కావు సం ♦ ప్రీతి నొంద
బాల నాయక మగుమాట ♦ లేల కుఱ్ఱ!

శివా—తండ్రీ! యుద్ధరంగ మట్లుండునని నేను భారతము జదివినప్పుడే తెలిసికొంటిని. ఇప్పుడు తమరు దానిని వర్ణించి నాకు

వీరికిముందు బోయ నవసరము లేదు.

జిజా—(తనలో) మేలు వత్సా! మేలు చక్కఁగా చెప్పితివి.

శహా—నాయనా! నీకు శూరలక్షణముల నుపదేశించు తల్లి చెంత నున్నప్పుడు నా విరికి మం దేమి సేయఁగలదు.

గీ. తల్లిపోసిన యుగుల నెల్ల దారిద్ర
శిశువు గుణముల దల్లిని జేర కున్న
వ్యర్థమగు యోజనలు సేయ వచ్చు గాని
దుదకు గాసైన గ్రహియింప దుర్ఘటంబు.

జిజా—ప్రాణేశ్వరా!

గీ. మొదటినుండియు ధీరత్వ మొదవ వలెను
గాని ధీరత బోధింప గలుగు నొక్కొ
ముండ్ల పొదలకు శృంగార ముగను క్రొన్న
పండ్ల నంటింప ఫలవృత్తి పదవిఁ గనునె.

శహా—ప్రేయసీ! నీ ప్రభావమును నే నెరుంగక పోలేదు.

గీ. పవలు రాత్రుల రేలను పవలు జేయు
నట్టి సామర్థ్య మువిదల కలరు గాద
అందు నీ దార్ఢ్యమును జెప్ప నలవి యగునె
మాటల ఖగోళముల బంతు లాట నిడవా.

జిజా—అది యంతయు దేవరవారి సహవాస మాహాత్మ్యమే

శివా—తండ్రిగారు! మా యమ్మ కట్టి ప్రభావమే యున్న యెడల దాముసు స్వేచ్ఛావృత్తినే యవలంబించి యుందురు.

శహా—వత్సా! శివకుమార! అది దుర్ఘటకార్యమోయి?

గీ. తన బలంబును పర బలం బును నెఱింగి

కార్యములు సేయ నగుగాని ♦ ధైర్యమునను
మంటికిని మింటికిని సూత్రమంటగట్ట
జూచు చున్నావు సంభవిం ♦ చుట హుళక్కి.

శివా—నాయనా!

ఉ. పుట్టువుతోనె యీ యవన ♦ భూపతు లెల్లరు సేన తోడనే
పుట్టిరె వెంటనే సిరియు ♦ బొందిరె దేశము లేలినారొకో
పట్టుదలన్ గ్రమంబుగ జ ♦ వంబును సైన్యము ధైర్యశౌర్యముల్
నెట్టన సంగ్రహించి ధర ♦ నీశులు కారె స్వధర్మకాంక్షమై.

శహా—ఏమీ! పెద్దకుండకే యెసరు పెట్టు చుంటివే! నీవే యాధారమున స్వధర్మము నిలుప గలనని తలంచు చుంటివి!

శివా—వారి దౌర్మార్గ్యమే నా కాధారము. యెట్లంటేని? ఎవ్వడు మానవ లోకమున కెల్ల నపకారము లొనర్చుచు గంటకుడై సంచరించునో వాడు దేశద్రోహి యనంబడును. తద్దేశ మీశ్వరస్వరూపమగుటచే నీశ్వర ఘాతుకుఁడని చెప్పుటకు సందియము లేదు. నా తలంచిన లోకకంటక సంహారమా ఈశ్వరకార్యము. నా కితర సహాయము లేల!

శహా—నాయనా! నీకు వెఱ్ఱి వేదాంతము మెండగు చున్నది?

గీ. ఇపుడు నీ యుద్యమంబుల ♦ నెల్ల వినిన
ముందుగా కట్టి నైతురు ♦ బంది ఖాన
నవల నీశ్వరుఁ డేమి స ♦ హాయ పడును
మొట్ట వేదాంతముల గట్టి ♦ పెట్టు మింక.

శివా—గీ. దేశ పుత్రుల బాధల ♦ దీర్చుటకును

చచ్చినను వారి జన్మలు ♦ సార్థకములె
యెల్ల జనులను బానిసంపఁ ♦ దెల్ల బ్రొాయి
చెవులు తెగి యూరకుండునె ♦ సిగ్గుకాదె.

శహా—అన్నా! ఎంత వీరకేసరివి! నీకె గాని యిట్టి పౌరుష మెవరికైన గలదా! ఈ భూమిని శేషుఁడు మోచి కాపాడుచున్నటు ల నీ వొక్కరుండవె యీ ధారుణిని కాపాడ దలఁచినావు. బాగుబాగు. యెవ్వరైన వినినచో నగుబాటగును గావున నూరకుండుము.

గీ. పడుచు దవవు మదంబున ♦ బరువులెత్తి
దుదకు గాళులు నొవ్వఁగ ♦ దుఃఖ పడెడు
వారినెందరి జూడమి ♦ వ్వసుధ యందు
గాన నీవేడ యా ధర్మ ♦ కార్యమేడ.

శివా—(తనలో) ఈయన హృదయమును మఱలింప బ్రహ్మం పే నాయకునకైన వశముకాదు. నా తరమగునా! ఆహాహా! లోకమె ట్టి యజ్ఞానాంధకారమున మునింగి పోయినదో! ఓ ప్రభాకరా! భానుఁడా!

ఆ. అగ్ని పుల్లను వెలిగించి ♦ నంతవ్రొవు
చిఱుత చీఁకటి నమయుంప ♦ బిఱుసు కాదు
ఘనత రాజ్ఞాన మహాదంధ ♦ కార మడప
బలుదెసల నిండు నీ కీర్తి ♦ భానుమూర్తి.

(ప్రకాశము) తండ్రీ!

గీ. ఈశ్వరోద్దిష్టమగు సత్వ ♦ మెలమి గలుగ
వేసు యుపకరణము లేమి ♦ చేయు నయ్య
కొండలన్నిఁటి బిండిగాఁ ♦ గొట్టవచ్చు

నిక స్వధర్మ ప్రతిష్ఠన • నెంత నాకు.

శహా—కుమారా! నీవు వేయి చెప్పినను నీ యుద్యమ మెంత మాత్రమును స్వప్రాణ భంగ కారక మైనది కాని, స్వార్థ పరత్వమై నది కాదు. ఎన్ని చెప్పినను ద్రవ్యముతో సాటియైనది లేదు. నా మాట వినుము. నీకు గొప్ప యుద్యోగ మిప్పించెదను.

శివా—అయ్యా!

గీ. మన సజాతీయ ధర్మముల్ • మంట గలయ
తురుష్కు లవమానమున నగ్గి • నురుకుచుండ
బ్రాహ్మణులు గోవులును కత్తి • పాలు కాఁగ
మనకు నుద్యోగ సుఖములు • ధనము లేల.

శహా—ఓహోహో! అహర్నిశము విచారణ నెఱుంగని నీ మాటలు విన నవ్వు వచ్చుచున్నది.

గీ. ఆకసము భిన్నమై పడు • ననెడి భీతి
టిట్టిభము కాళులను నెత్తి • పట్టినట్లు
వ్యాకులం బందుచున్న యీ • లోకము న
ముద్ధరింపగఁ గంకణ • మూనినావె.

శివా—ఏమీ! (లేచి కోపము నభినయించి ఆలోచించి) ఛీ! ఈ కోపము నన్ను పాపభూయిష్టుని జేయుచున్నది. నే నేయుత్కృష్ట కార్యమును జేసితినని కోపించి నా ప్రతాపమును వెల్లడి చేసుకొందును. (ప్రకాశముగ) తండ్రీ! మీకు తీరుప బలుకుట్లుచే నా తలచిన కార్యమునకుఁ బ్రోత్సాహ పరచిన ట్లూహించుచున్నాఁడ.

శహా—(తనలో) ఆహాహా! వీని హృదయమునఁ బొడమిన ధర్మసంస్థాపనాంకురమును బెల్లగింప నా తరము గాకున్నయది. నే నే

ము సేయుదురు. (ప్రకాశము) నాయనా! ఈ తురుష్క ప్రభువులు నీ కేమియపకారము చేసిరని నీ వీ ప్రతిన బూనితివి.

శివా—నా కపకృతి జేసిరని కాదు. దేశమున కపకార మొన ర్చుట వలన నేనీ పూన్కి పట్టితిని. అటులగాక దయావంతులై దేశ మును ధర్మముతో నేలినచో నిదె నా ప్రాణములను బుద్ధిపూర్వకముగ నీ యవనుల కర్పించెద; నదిగాక నా యభిప్రాయము తురుష్క దౌ రాత్మ్యక్య సంహారముకాని తురుష్క సంహారము కాదు. కేవలము జాతిద్వేషమును వహించుట పాడుమార్గము కాని, సజ్జన పద్ధతి కాదు.

శహా—నాయనా! నీకు రాజ్యాభిలాష యున్న యెడల నిన్ను గొంత దేశమునకు రాజుగా జేసెద నేలుకొమ్ము. నీ కీ యడియాస యేల.

శివా—అయ్యా! నాకీ రాజ్యముతో నవసరము లేదు. మీకు శక్తి దయయున్నచో నా తురుష్కుల చేతనే యీ దేశమును దయా ధర్మములచే నేలింపుడు. నేను వారి సేవ జేసెదను.

శహా—(తనలో) అక్కటా! నే నెన్ని చెప్పినను పెడచెవిని బెట్టుచున్నాడు. ఈ సంగతి బూతిగా వినినచో నవాబు నాపై యా గ్రహించును. (ప్రకాశము) నాయనా! నీ యుద్యమంబెఱిగిన న బాబు మన జాగీరులనుకూడ లాగుకొని మనల నందరను బహిష్కార ము చేయును సుమీ!

శివా—అయ్యా! జాగీరులు పోవునని భయపడుచుంటిరా! పోనిండు?

చ. పరమ పవిత్రమై తనరు • పౌరుషమున్ విడనాడి గోఘ్నులన్

దురకల గొన్చి చేకొనిన • దుష్కృతవిత్త మయంబులైన జా
గిరుల శతమ్ములన్ బ్రతుకు • కేవల దూష్యముగాన మేలెయా
నిరతము స్వేచ్ఛమై యొదవు • నిష్కము గోలునె యెల్ల జాగిరుల్

జిజా—(స్వ) ఆహా ! ఈ నీతిచే న్నా ప్రాణేశ్వరుని హృదయ
ము సైతము మరల వలసినదే.

శహా—(తనలో) నేనిక సామోపాయమును విడచి కొంచెము
బెదరించి చూచెదను. (ప్రకాశముగా)

శా. ఔరా! యెంతటి వాఁడ వైతివి శివా! • ఆశ్చర్యమైతోచె నీ
బీరంబుల్ వినఁ దండ్రియుం చనక ని • క్కీతిన్ ననుం దూరుటల్
శూరత్వంబని యెంచినాఁడవొ తురు • ష్కుల్ సేయుయుద్ధంబులన్
ధీరత్వంబున నిల్చి చూచినను నీ • తేజంబు తెల్లంబగున్.

శివా—(తనలో) మా తండ్రిగారి వివేకవృక్షము తుట్టతుద
కాగ్రహ ఫలంబుల గాయుచున్నది. నా దోహద మెంతమాత్రమును
బనికి వచ్చుటలేదు. కావున, బ్రస్తుతము నేను శాంతమును వహించి
నా యభీష్టము గుప్తముగా నెరవేర్చు కొందును. (ప్రకాశముగా) అ
య్యా! కోపగింపకుడు. నేనుమాత్రి మెచ్చుటను కొలది కాలము
వరకు గొలువు చేయుదలచుకొన లేదు.

శహా—పోనిమ్ము. నీవు మాత్రి మీా విజాపురమున నున్న నీ
కపాయము సంభవించును గాన మీా యిరువురును పునహానగరమునకు
రండు. ఆ పురమును బాలించుటకు నేను నియోగించిన దాదోజీయ
ను బ్రాహ్మణుఁడు మిమ్ముల బోషించుచు దక్కిన సైకమును నావద్ద
కు బంపుచుండును.

శివా—(తనలో) నాకు మంచి సమయము దొరికినది. నాయు

ద్యమమునకు గొంత ధనసహాయము కావలెనుగదా ! (ప్రకాశముగా) తండ్రీ! నే నా పురరక్షణము విషయమై కొంత శ్రద్ధ తీసికొన వచ్చునా !

శహా—అందులకు సందియమేల ? రావలసిన ద్రవ్యమును బహు శ్రద్ధతో రాఁబట్టుకొనుము. నీ వంతటి వాఁడవైన నా కింక గొదువయేమి. నీకు గావలసిన ద్రవ్యమును వ్యయము చేసికొనుచు తక్కిన దానిని నా చెంతకు బంపు చుండుము.

శివా—మహాప్రసాదము తండ్రీ !

శహా—ప్రాణేశ్వరీ ! మన శివునకు సయీబాయియను కాంతామణిని భార్యగా నిశ్చయించితిని గాన త్వరలో నీతనికి బెండ్లిచేసి మిమ్ములను బుణహాకుఁ బంపి నేను తంజావూరునకుఁ బోయెదను.

జిజా—చిత్తము !

శివా—(తనలో) ఓహో ! నా యుద్యమమునకు విరుద్ధముగఁ బెండ్లిచేసి నా మెడ కొక గుదిబండ కట్టును కాబోలును. కాని మామ్మె కూడ నాకు దోడ్పడునట్లు చేసికొన లేకుందునా ! నే నెట్లైన దుష్కులచే పడరాని కష్టముల పాలై పరితపించుచున్న దేశ పుత్రుల నుద్ధరింప స్వధర్మంబును బ్రతిష్ఠించి తీరెదను.

శహా—వత్సా ! రమ్ము పోవుదము.

అందరు—(నిష్క్రమింతురు)

—ఇది ప్రథమాంకము—

శ్రీ

# మహారాష్ట్ర విజయము

## ద్వితీయాంకము.

### ౧ రంగము—పురమునకుఁ బోవుమార్గము.

(పాండురంగదత్తు ప్రవేశము)

పాండు—ఆహాహా! ఎంత చెడుకాలము సంభవించినది దైవమా!

సీ. పార్థ వృకోదర రా ♦ శ్వత్థామ ముఖవీర
కంఠీరవుల కేద్ది ♦ కన్నతల్లి
క్రూరరాక్షస నాశ ♦ కారణుం డగు హరి
యవతారముల కేది ♦ యాటపట్టు
సకల సస్య విశేష ♦ సామ్రాజ్య లక్ష్మి పరి
దానంబునకు నేది ♦ తావలంబు
భవ్య నదీక్షేత్ర ♦ భావుకంబౌట స
త్కర్మల కేది ము ♦ ఖ్యమగు తావు
గీ. అట్టి భారత ఖండంబు ♦ నంద నిపుడు
ధర్మమును వీర గుణమును ♦ దగుల బడియె
బ్రాహ్మణులు వసియించెడు ♦ పాడి వోయె
గటకటా! యేమనందు దు ♦ ష్కాల మహిమ.

బీజపురముంండి బైలు దేరినది మొదలు పునహా నగర మెప్పుడు చేరు దునాయని యాతురముగ దగని నడక నడచితిని. భగవానుడైన భాస్కరుండును తురకలవలె నామీఁద దీక్షమునె చూపుచున్నాఁడు. ఇక నడచుటకు శక్తి లేక యున్నది. ఈ కనుపించు చున్న తమాలవృక్షచ్ఛాయను కొంతవరకు విశ్రమించెదను. (కొంచెము నడచి) హా శంకరా! (నిర్వేదముతో కూర్చుండును)

(అంతట శంకరదత్తు అనువాడు ప్రవేశించును)

శంక—ఈ కారడవిలో నన్ను పేరుపెట్టి పిలుచువా రెవ్వరై యుందురు! (చూచి) ఇదిగోయిక్కడ నొక బాటసారి కనుపించు చున్నవాడు. ఇది సంతాపార్థమునకాని నన్ను బిలచుట కాదు. శంకర శబ్దోచ్చారణచేత నీతఁడు బ్రాహ్మణునివలెను వేషంబున దురుష్కుని వలెను తోచు చున్నది. సమీపించి యడిగెదను! (సమీపించి) అయ్యా! మీ రెవ్వరు?

పాండు—అయ్యా! నేను నొక బ్రాహ్మణుఁడనే.

శంక—అటులైన మీరు సన్యాసులుకారే? మీకీ ముండన మేటి మండనము.

పాండు—ఈ రోజులలో ముండనము లేకున్న దండనమే!

శంక—ఎందువలన!

పాండు—ప్రభుపాలనా మహాత్మ్యము వలన.

శంక—పాపము శమించు గాక. మీ కీయవన పరిపాలనము చాల బాధ కలిగించు చున్నటు లున్నది.

పాండు—(స్వ) వీ డెవ్వఁడో చిరకాలమునుండి యింతవరకు గాఢముగ నిద్రించుచునే యున్నటు లున్నది. (ప్రకాశముగా) అయ్యా!

మా బాధల కేమిగాని ముందు మీ రెవ్వరో చెప్పుడు ?

శంక — నేను యవనాక్రాంతమైన గల సుదర్శ నాగ్రహారము న నివసించు బ్రాహ్మణుఁడను. మహారాష్ట్ర స్వధర్మ సంస్థాపనముకై కంకణము గట్టుకొనిన శివాజీమహారాజుగారు తోలుక తోరణా దుర్గమును సాధించి విజయ తోరణమును గట్టనున్నాఁడని విని సంభావనకై పోయి యా మహోత్సవమును గన్నారఁ జూచి బహుమతి గొని తిరిగి నా నెలవునకుఁ బోవుచున్నాను.

పాండు — అయ్యా ! నమస్కారము. ఆ శివాజీ మహారాజుగారి నామ ముచ్చరించుట చేతనే నా ప్రాణము లేచివచ్చినది. నేను బాధల బడలేక యచ్చోటుల దాటుకొని పోవుచున్నవాఁడను. మహాత్మా ! ఆ తురుష్కులు బ్రాహ్మణుల బెట్టు బాధల దలంచుకొనిన గుండెలు బ్రద్దలగు చున్నవి. (అని దుఃఖించును)

శంక — అయ్యా ! ఊరడిల్లుఁడు. యవన వినాశకాలము సంభవించినది లెండు.

(అంతట నొక యవనుఁడు ప్రవేశించును)

రుస్తుంఖాను — అరే ! యిద్దరెందు బోడీ బామ్మల్ గుసగుస ముసముస లాడతాది. ఈ స్నేనాకి సాటువుంచి నై తెల్సుకుంటామ్. (అట్లుచేయును)

పాండు — అయ్యా ! ఈ తురుష్కులలో కొందరు బ్రాహ్మణుల బెట్టు బాధల నేమని చెప్పుదును.

ఉ. ఏకడఁ జూచినన్ దురుక • లెల్లరు బ్రాహ్మణు డన్న వారలన్
వ్యాకుల మందగా గుమురు • త్రైశలబన్ గొజీగించి బల్మిచే
మా కులమందు చేయుమని • మాంసము నోటను గ్రుక్కుచుండి ర

య్యా! కలికాల వర్తనము ♦ లుర్విని భూసురు లుండ శక్యమే.

శంక—అయ్యా! మతధర్మములు మంటగలసి దుష్టకాలము సంభవించి నపు డెవరేమి సేయగలరు. తిరిగి మన పుణ్యవశమున శివాజీచే ధర్మప్రతిష్ఠాపన కలుగఁ గూడదా! ఊరడిల్లుడు.

రుస్తుం—(జనాంతికము) ఈళ్లు శివాజీ మాట సెప్తె మాది గుండెల్ దడదడా ఖొడ్తాది. ఆడు బడా సెడ్డ మనిసి. బలేమంగా. బహుత్ మాయఖాడు మేరాసుల్తాన్ ఆడిమంగతి యిని ఫికిరిలో మున్గి పోయి ఆడిమమాచార్ తెల్సుకురమ్మని నాకీ ఆజ్ఞా యిచ్చినాడు. అది సూస్తే మాకీకూడా ఫికిర్ అవుతాది. పునాకు నానేకు మైక్యాకరనో కాని మే తర్వాత సెప్తాన్.

పాండు—అయ్యాఁడా! నాకు నూఱట యెటుల గలుగును.

ఉ. చచ్చినవారు చావ హరి ♦ సత్కృప చేతను నొక్క కూఁతు నా
కిచ్చెను దానినిన్ దురుక ♦ లే హరియించిరి మూకు శేలఁ పా
లిచ్చెడి గోవుబట్టి వని ♦ యించుచు మాంసము మూటగట్టి పై
పెచ్చుగ నెత్తిఁ బెట్టి నడి ♦ పించుచు గొట్టిరికేమి సేయుదున్.

శంక—శివశివా! ఎంత దుష్కృతమంటి! చెట్టు చెడేకాలమునకుఁ గుక్కమూతి పిందె పుట్టినదన్నటుల దురుష్కరాజ వినాశకాలము వచ్చుటచేతనే యీ ఘోరకృత్యములు జరుగుచున్నవి.

పాండు—నాయనా! పాపులు చిరాయుష్కులు కదా!

రుస్తుం—ఇప్డు మై గడ్బిఢా సేస్తే ఉన్నమంగతి అంతా ఊడి పడదు. తర్వాత నాది తమాస్ చూప్తాన్.

పాండు—అయ్యా! నా కష్టములు చెప్పికొనుట కంతులేదు. ఆ శివాజీ మహారాజు చరిత్ర మెఱింగి యున్నంత యూనతీయుడు.

శంక — అటులైన జెప్పెద వినుఁడు. ఆ మహాత్ముఁడు

చ. చిరుత తనంబునుండి మద ♦ సింధురముం బలె కాననంబులన్
దిరుగుచు మావళేలనెడు ♦ ధీర వనాటుల సేనగూర్చి పా
మరు లొనరించు దుష్కృతుల ♦ మాపి స్వధర్మము నిల్ప శత్రు భీ
కరముగ దేశ శాంతికయి ♦ కంకణమున్ ధరియించె దక్షుఁడై.

పాండు — ఆ మహనీయుని ప్రతిజ్ఞకు భగవంతుఁడు సాయ పడుగాక.

రుస్తుం — ఐసా క్యా! మీకీ భగవాన్ వుంటె మాకీ అల్లా వుండాది. నాకీ ఒక్కడికీ ఫికిర్ కాని మాది తురఖదెబ్బ తింటే అడవివాళ్లు భడవవాళ్లు కొండకీ కన్నంలో దూరావాల.

పాండు — అయ్యా! తరువాత.

శంక — దయాస్వభావుండు కాన తన అప్రతి హతమైన ఖడ్గ ప్రభావమును చూపకయే ఆ దుర్గాధిపతికి గొంత నయమును భయమును జూపి తోరణాఖిల్లాను స్వాధీనము జేసికొని స్వధర్మస్థాపనకు బ్రథమ తోరణము గట్టించిరి. అప్పుడు నా సంభావన దెచ్చుకొని నా పురంబునకుఁ బోవుచున్నాఁడను.

పాండు — సంతోషము సంతోషము. దేశమాత గర్భమున మాణిక్యము వలె నుద్భవించిన యీ శివాజీ మహారాజుగారికి భగవతి సహాయ పడుగాత.

రుస్తుం — అరే! యీవాడికి ఖులాస యెక్వా పుట్టింది. తోరణాఖిల్లా పోయిందిఅంటే మాకీ బడా దుఃఖం అవతాది. ఈ బాపనోళ్ల ఖులాస్ యేమో మూడావాల. (ఎదుటికివచ్చి) క్యారే బామన్ మాకీ పాపం పెడ్తావు క్యా ఠైరహో. (భయపెట్టును)

ఇద్దరు—(భయము నభినయింతురు)

రుస్తుం—క్యారే బాత్ బోలో నహీంతో మీది ముసలమ్మ ఖాడ్కి పంపి యేస్తామ్.

పాండు—(స్వ) ఓరి దేవుఁడా! ఆచార్యులవారి ముద్ర భుజము తప్పినను వీఁపు తప్పదన్నటుల నా కెక్కడికిఁ బోయినను యీ మ్లేచ్ఛబాధ తప్పకున్నది. (ప్ర) సాయెబయ్యా! ఇదిగో చూడు. నీకు సలాం చేసెద. మా జోలికి రాకు. మీ మతము నా కిదివరకే మీ వాళ్లిచ్చియున్నారు. నేను మీ వాడనే సుమా! ఈయన మా వాడే. నా మాటనిజమే లేకున్న నా తలకాయ బోడిగా వుండునా చూడుము నా తల (అని బోడితలను చూపును)

రుస్తుం—అరే! గుండుసూస్తే యిది నమ్మతాది క్యా! ఖ్యా మన్మల్కి ఖూడా గుండు వుంది. మీది ఝూటామాటఖూడా. ఇది వింది ఆడు షివాజీకి బగవాతీ షాయం సేస్తాది బాత్ నీది సెక్నీకి లేవు, సెప్పు నహీంతో నరికియేస్తా.

శంక—అయ్యా! మిమ్ములను మేమేమియు నిందించుట లేదు. మమ్ముల రక్షించి విడిచి పెట్టుడు.

రుస్తుం—అరే! బదామ్రష్. మాకీ సెపులువుండాది. ఝూటావ ల్కు తావ్ నీకీ యేటా యేస్తామ్. (కత్తి నెత్తును)

పాండు—మహాప్రభో రక్షించుము. (అని వడకుచు కాళ్లఁబడును)

రుస్తుం—మాకీ రక్ష గిక్ష జాంతా నై. నీకీ బోడీగుండు సేసినావ్. మాంసం పెట్టినావ్. మాది మతంలో దూరుమన్నావ్. మా మతం బెద్దకావాల. అందూకు మై సేసినావ్. అరే మాకీ యేమ్పితప్పు

పాండు—(జనాంతికము) వీడిపొట్ట పొడిచివెయ్య. మనమాట లన్నియు వినినాడు సుమండీ.

శంక—(జనాంతికము) విఘ్న భయమేమి? ఈ పాలకర్రి తీసు కొని కపాలము భిన్నముగునటు లొక్క దెబ్బ కొట్టినచో వీడి మొఱ రడగును.

పాండు—(జనాంతికము, ఎంత వెఱ్ఱివాడవయ్యా! వానికొట్టి భూమిమీఁద బ్రతుకగలమా? మంచి మాటలచేతనే వాటి బయల బడవలెను. (ప్రకాశము) సాహేబుగారు! బ్రాహ్మణులముగనుక మా మత మందములను సహింపను. కరుణించి మమ్ముల విడచి పెట్టుము.

రుస్తుం—అరే మీది మతం సెడ్డది. మాదిమతం దొడ్డది. గనుక దూరుమన్నామ్. ఏమ్మితప్పు.

శంక—అయ్యా! మీ మతము మీకు గొప్ప. మా మతము మాకు గొప్ప

రుస్తుం—మీది బడ్వామతం. నహీంతో అన్న బిడ్డాకి సెల్లెల్ బిడ్డాకి పెండ్లిసేస్తారు క్యా! ఝూటాధర్మం మాకీ బడా తప్పుహై.

పాండు—చిత్తము. మాది తప్పేనండి. మమ్ముల నింతటితో విడువుఁడు.

రుస్తుం—నై నై మాకీ పమాధానం శెప్పిపో. (తననుచూపుకొని) ఇది జంతువును సంపూతాది. (బ్రాహ్మణుని చూపి) అది సం పదు క్యా జబాబ్ సెప్పు.

శంక—చిత్తము.

రుస్తుం—అరే! మాకీ తెలంగిపేరు మాలుం నై. ఇది పేరు

యేస్టి. (అని యొక చెట్టును చూపును)

పాండు—దాని పేరు మామిడి చెట్టు.

రుస్తుం—మామిడి సెట్టుకీ జీవంవుందీ. ఆవుకీ జీవంవుందీ. మా ఖ్జైఖాయా నరికి పచ్చడిసేసి మీది తింటే మిస్‌ఖిల్లా మంత్రింసెప్పి ఆ వుకి నరికి ఫెట్టి మాంషంకోపి ఫులాఫ్‌వండి మాది తింటాది. అరే! మీ కీ ఫంటికింద ఫస్ ఫస్ కాని మిస్‌మిల్లా గిస్‌మిల్లా కుచ్ నహీ. మాంసా న్కి మాంసం యేమూవాల ఖులాస్ యెక్వాకావాల. మాది అధికా ర్ మీది మాంషం ఖాయవాల. మీకీ మాకీ పనతితల్లి బిడ్డల్ వర సవుండాది గన్కా మీది స్లి మాకీ ప్యారీ కావాల. అరే! మాదియే ల్మీ తప్పు సెప్పువోయి మాకీ బడాబడా పాపం యిచ్చి తిట్టి ఫెట్టియి ది తురుకఫిండం యిని ఊరుకోద్దు మారన్ పేస్తాది దేఖో. (అని కత్తి దూస్తును)

ఇద్దరు—శివశివా! రక్షింపుము. (అని మొలుగెత్తుచున్నారు)

(తెరలో)

గీ. వలను భయమిదె మిముబ్రోవ ♦ వచ్చు చుంటి.
శివుని సైన్యంబు లుండ ర ♦ క్షింప నరుదె.

(నేతాజీ ప్రవేశించి చూచి)

నేతా—ఎవ్వడవు రోరి విప్రుల ♦ నేచు చుంటి
విప్రుడు శివశక మని మది ♦ నెఱుగ వ్రాక్కా—

(అని ఆపివేయును)

రుస్తుం—అరే! తూ కోన్ హై. మాకీ నయితానులాగ అడ్డం వచ్చినావు.

నేతా—నేనా! నీవంటి వారలం జంపి బ్రాహ్మణుల నుద్ధరిం

చుటకే యేర్పరచబడిన పాడను. శివాజీ మహారాజు గారి భటుడను.

రుస్తుం—(తనలో) అరరే! ఇపుడు మాకు ఫులిమీాద పుట్రి వచ్చింది. (తనను జూచుకొని) ఇది బాఫనోళ్ళ సంపడాన్కి తయూర్ అయితే యీాడూ మాకీ సంపాడాన్కి తయూర్ అయింది. అబిక్యా కరనా! (పరికాశం) క్యాజీభాయి పలామ్. మాకీ రాజదోహం తలచినారు గన్క మై సంపియేస్తాం. మీాకీ యేమి జావ్,

నేతా—ఓయి పిచ్చివాఁడ! నీవు నిరపరాధులైన బ్రాహ్మణులను జంపుట దేశ ద్రోహముకాదా! నిన్నే చంపెదను. నీ వెవడవో చెప్పుము.

రుస్తు—మై బీజపూర్ సుల్తాన్ కాడ దూతహుం. హమారా బాత్ సునో కుక్క ఒకసోట సెడ్డసెప్పి యింకొకసోట మంచి సెప్పదు ఈళ్లు మాది సుల్తాన్కి ద్రోహం తలచినాడ్. అందూకు మై తయూర్ అయినావ్. మీాది ఖోపంసేస్తే మాకీయేల. యిడిచీపెట్టాం తీస్కపో మై జావ్రంగా.

నేతా—ఓయీా! నిన్ను దూతవగుటచే ప్రాణములతో విడువవలసి వచ్చినది. ఇఁక నెన్నడు నెవ్వరికిని హింస చేయనని చెప్పుము. లేకున్న నిన్ను విడుపను.

రుస్తుం—నై నై మహారాజ్! మా ది అల్లాతోడు.

నేతా—అటులైన బొమ్ము.

రుస్తుం—చిత్తం మహారాజ్ (స్వ) అరే! బగవాన్ జతికి బైల పడ్డామ్. ఉన్నాపంగతి తోడా లేనిపంగతి తోడా మోస్కాని యెల్లి మేరా సుల్తాన్ కా చెవులో ఏస్తామ్. హమారా ప్రాణానికి మో

షం కలిగేది మాకేమేల. మాదీ జీతంరాళ్లు నాల్గు మాకిస్తే సాల్. మై యెల్లిపోతామ్. (నిష్క్రమించును)

నేతా—అయ్యా! మీకు భయము లేదు. మీ రెక్కడికిఁ బోయెదరు?

శంక—అయ్యా! నేను సుదర్శనాగ్రహారము పోయెదను.

పాండు—నేను పుణేకుఁ బోయెదను.

నేతా—ఈయనను నా సేవకునిచే సుదర్శనాగ్రహారమునకుఁ బంపి మిమ్ములను నేను పునహాకు దోడ్కొని పోయెదను.

శంక—అయ్యా! నన్ను దోడ్కొని పోవుటయే కాదు. నన్నన్నివిధముల నుద్ధరించు భారము మీయదియే.

నేతా—ఏమది? మీకేమి యుపకృతి సేయవలెను.

శంక—(స్వ) (నలుదిక్కుల చూచి) ఈ తురుష్కుడీ సమీపమున లేడుకద! (ప్ర) మహాత్మా! (దుఃఖముతో) దలచుకొనినచో శరీరము తగులు వడుచున్నది. ఏమని చెప్పుదును. (ఏడ్చును)

నేతా—అయ్యా! మీకీ పరితాపమేల.

శంక—యవనకృత పరిభవానలమున.

నేతా—సరిసరి, తెలిసినది. మీ రేడ్చిన లాభము లేదు. మీరభిమానమను శబ్దమున కర్థ మెఱింగినచో మహానుభావులైన శివాజీ ప్రభువుగారిని సేవించి ప్రతీకార మొనర్పుడు.

శంక—అయ్యా! నేనును అందుకొఱకే యే సంసిద్ధుడనై వచ్చుచుంటిని. నాకెవ్వరు దిక్కు లేరు. నాకై యేడ్చువారిని యవనవ్యాఘ్రమే మ్రింగివేసినది. (దుఃఖించును)

నేతా—అయ్యా! శోకింపకుడు. మీ క్రోధానలము చల్లారు

టకు దగిన సమయము వచ్చినది లెండి. రండు పోవుదము.

శంక—చిత్తము. (నిష్క్రమింతురు)

—మిశ్రవిష్కంభము—

---

రంగము—2 వ ప్రవేశము.

(శివాజి, ఏసాజీ ప్రవేశము)

శివా—మంత్రివర్యా! ఏసాజీ! మనము సంకల్పించిన వేళ మంచిదగుట చేతనే యత్నముమున తోరణా, లోహగడ్, కొండాణా, త్రికోణా మొదలగు ఖిల్లాలు వశమైనవి. అయినను యింతమాత్రము నకు సంతసింప గూడదు.

ఉ. ఎప్పుడు దేశమంత సుఖ • యింతురొ క్రూర తురుష్క బాధలన్
దప్పి స్వతంత్ర జీవనము • నన్ వసియింతురొ గోకులంబు లే
ముప్పులఁ బొందకుండగ స • మోఘముగా జరియించు చుండునో
యప్పుడె యాత్మలో మనము • హాయిగ సంతస మందగావలెన్.

ఏసా—దేవా!

గీ. దేశ సౌఖ్యము కొరకు నా • త్మీయధర్మ
మును బ్రతిష్ఠింపఁ గంకణ • మును ధరించి
నట్టి మీకు భవాని స • హాయ పడదె
ధరణి యోగ్యులకును తోడు • దైవమెకద.

శివా—ఓయీ! తమ ఖజానాను మనము దాఖలు చేసికొన్న సంగతి బీజపుర నవాబునకు దెలియక పోదు. ఆతఁడును వెంటనే యు

దసన్నాహము చేయక మానడు. మన నేతాజీ తక్కిన మావళేలను దోడ్కొని వచ్చుట కేగి యింకను రాకుండె. మన సైన్య మభివృద్ధి చెందినగాని మనకు బూర్ణ స్వాతంత్ర్యంబు కలుగ నేరదు.

ఏసాజీ—మహాప్రభో! ఆతఁడును కృతకార్యుండై వచ్చుచునే యుండును.

(అంతట నేతాజీ పాండురంగదత్తుతో ప్రవేశించును)

నేతా—మహాప్రభో! నమస్కారము.

పాండు—(చేయి యెత్తి) హే శివరాయ

గీ. మాతృ దేవత దాస్యంబు • మాన్ప దలఁచి
యమనులను గొట్టి యమృత భాం • డమును గొన్న
వైనతేయుని యద్భుతం • బైన శక్తి
మిమ్ము రక్షించు గావుత • నెమ్మిమీర.

శివా—(పాండురంగ దత్తుతో) అయ్యా! మీ యాశీస్సుల శిరసాగ్రహించినాఁడను. మీ రెవ్వరో మీ వేషములచే గుర్తింపలేకుంటిని.

పాండు—నేను బ్రాహ్మణవాచ్య మ్లేచ్ఛుడను.

శివా—కటకటా! మీరును దుర్భరావస్థలో మునిగియున్నవారెనా? ఇపుడు మీ యుద్యమ మేమి?

పాండు—మహాప్రభో! ఏమని చెప్పుదును.

గీ. బుర్ర గొరిగించి మత ధర్మ • ముల హరించి
కూఁతుఁ దొంగిలి మానంబు • వాతఁ ద్రోయ
సమయ మిది కాదటంచు శాం • తమును గంటి
బ్రాణముల పైని దీపి యె • వ్వనికి లేదు ?

శివా—ఆర్యా! సంతోషము సంతోషము. అటులైన మీకు గ్రమమున సైన్యాధిపత్య మిచ్చెదము. మా కొలువున బ్రవేశించి కాలక్రమమున మీ క్రోధానలంబును జల్లార్చు కొందురు గాక.

పాండు—చిత్తము. ధన్యుడ నైతిని.

శివా—మిత్రుడా! ఆటవికులకు ధనుర్వేదము కరతలామలకమే కదా. తరువాత దక్కన యుద్ధప్రక్రియలయం దారి తేరునట్లు సాధకములు చేయించు చుండవలెను.

నేతా—దేవా! చిత్తము.

పాండు—దేవా! ఈ యాశ్రితునకు నదే యాజ్ఞ.

శివా—మీరు తరువాత పోవచ్చును. దయసేయుడు. మంత్రిశేఖరా! మనకు సైన్య సంపత్తి విస్తారముగా చేకూరినది. మనము కళ్యాణ ప్రాంతమునకు యుద్ధమునకు బంపిన అబాజీ సోనదేవుని వార్త గానరాక యున్నదే!

ఏసా—దేవా! ఆతని శౌర్య సాహసము లద్వితీయములు కాని సాధారణములు కావు. సఫలీకృత కార్యుండై వచ్చుచునే యుండును.

(అబాజీ ముల్లానా సుబేదారు కొందరు సేవకులు ప్రవేశింతురు)

అబాజీ—మహారాజ! జయము జయము.

శివాజీ—మిత్రమా! విజయలక్ష్మిని దోడి తెచ్చితివా!

అబాజీ—శివరాయదేవ! అంతియే కాదు. ఆ దుర్గమును స్వాధీన పఱచు కొనుటయు నా యధికారియగు ముల్లానా సుబేదారుని చెఱపట్టియు విజయలక్ష్మి గ్రహణమును జరుగుటకు తేమ శాసనమే కదా మూలము.

శివా—ఓహూ! ఆ దుర్గాధిపతులు వీరేనా యేమి? (సగౌరవముగ) అయ్యా! తురుష్క ప్రభువా! ఈ పీఠముపై దయసేయుడు.

సుబే—(తనలో) అరే! మాకీ గౌరవం సేస్తే మాది దిల్కు బడా సిగ్గు అవతాది. అబిమై క్యాకరసా. జుట్టు సేతికి యిచ్చి ఒళ్లు గెంతులు ఏస్తే క్యాఫాయిదా. కాని మెల్లంగా సెప్తాన్. (ప్రకాశము) క్యాజీ మహరాజ్ సలాం, యిద్దా మాకీ బైఠ్నేకు తాఖత్ నహి.

శివా—ఓయీ! వెట్టివాడ యింపుపై గూరుచుండుము.

చ. సమయము మారు నప్డు గ్రహ ◆ చార వికారము గల్గి దుఃఖ సౌ
ఖ్యములకు జిక్కు చుందురు ధ ◆ రాధిపులైన దరిద్రులైన ను
త్తములు సుఖాసుఖంబుల ము ◆ దంబును ఖేదము బొంద రెండ కా
లములనను నీర మింక మర ◆ లన్ నదు లెల్ల జలంబు బ్లూనవో,

కావున మనంబునం దోటమి కల్గెనని సంకోచింపకుము.

సుబే—వహ్వారే వహ్వా! నాది యిల్లు వొళ్లు గుల్ల సేసి కళ్లనీళ్లు ఫేమి అంటే యేమ్టి సెప్తాన్.

శివా—అయ్యా! చింతింపకుడు. మా సేనాధిపతి మిమ్ములను చెఱ బట్టినను నేను విడచెదను. మీరు స్వేచ్ఛగా పోయి సంచరించెదరుగాక.

సుబే—(తనలో) ఇది ఝూటామాట, లేకపోతే షాంది సేన సంపి కోట స్వాధీనం సెస్కొని మాకీ సెఱపట్టి యిడిసి పెడ్తాం, ఫోలంటే యెవరు నమ్ముతారు. యిది మోసంపని. (ప్రకాశము) క్యాజీ ఐసామాట సెప్పి మాకీ పరమ్ తెచ్చి పెడ్తే మీకీ యేమ్టి ఫాయిదా. మాకీ నరికీయేస్తే నరికీ యేయవాల. నహీంతో ఖైదు యేయావాల, ఒకటీమాట సెప్పు. అది యిడిసి పెట్టేది యిది పారిపోయ్యేదినా, మాకీ బ

దా నామోషికీ వస్తాది. యిది తురుక ఫిండం దేఖో.

శివా—ఓయి తురుష్క-పరిభువా! నేను సత్యముసే చెప్పుచున్నాను. నీయందు నాకు పగలేదు. మా హిందూ ధర్మ పరిరక్షయే నాకు ముఖ్యము.

సుబే—(స్వ) అరే! యితని బుద్ధి బడా దొడ్డాది. బడా ధర్మశాలి అని పిచ్చుకోవడానికి వుద్దేశం కలిగి యీలా సెప్తా వుండాడు. కాని మై ఐత్తో నరికి యేస్తాం. ధర్మానికి పోయినాడు. తంటాలో తగులుకుంటాడు. పోనీ మాకీయేల మైబికూడా పొగడి యెక్వా సంతోషం పుట్టించి మై చలేగావుంగా. (పరికాశము) మహరాజ్! ఆప్కా-సమన్ కతా-హుం. మీది ధర్మబుద్దికి మేరెకు బహుత్ ఆనంధహోగియా. మాకీ మర్యాద గిర్యాద జరుగుక్ నహి.

శివాజీ—సందియము లేదు. మిమ్ము దప్పక విడ చెదము.

అబాజీ—దేవా! నా చిన్ని విన్నప మాలించుడు. దేవరస్వనాశ కారణమైన మృత్యువును స్వయముగ బెంచుకొన జూచుచున్నారు.

శివా—ఓయి పిచ్చివాడ వినుము.

మ. ధనమా పోయెను రాజ్యమా తరలెశ ♦ స్త్రవారితమా దూరమ
య్యెను నర్వస్వముపోయినీకువశుడ♦య్యెన్ సాహసోత్సాహముల్
గనరావట్టి పరితాప హీనుడు గుము ♦ ల్లా నా సుబేదారు వీ
నిని హింసింప బరికెష్ఠయే మనకు ము ♦ న్నింపంగ బరిఖ్యాతియా.

అబాజీ—దేవా! దయయుంచి యొక్క-మనవి వినుడు.

మ. ఉపకారంబు స్మరించు వారలెతు ♦ రుష్కా-క్ష్మీశు లెప్డైవపూ
ర్వపు వైరంబు దల్చుచున్ మరల సం ♦ గ్రామంబు కల్పించి పరి

త్యపకారంబు దలంపరే యిటులఁ బ్ర♦త్యర్థిన్ విడం జూతురే
నృప ధర్మంబగునే దయా సమయమే ♦ శ్రేయంబె యూహింపుడీ
దేవా ! పట్టుకొనిన వానినెల్ల విడచినచో మనకు స్వధర్మ ప్రతిష్ఠాపన దుర్ఘటము కదా.

నేతా—మహారాజా! బీదలయెడ జూపవలసిన దయను శత్రువులపై జూపుచున్నారు.

శివా—సచివాగ్రిణీ! మా తండ్రిగారు ప్రభువులై యున్నంత వరకు నన్ను మహారాజాయని యెన్నడును సంబోధింపకుము. మఱియు నీవు వచించినది నిజమైన శూరలక్షణము కాదు.

గీ. ఎట్టి వైరి నైన ♦ బట్టి బాధించుట
కంటె సత్కరింప ♦ ఖ్యాతి కాదె
వేయి యేల యితని ♦ విడచుటయే గొప్ప
యెఱిగి నట్టివారి ♦ కిదియె శిక్ష.

సుబేదా—(స్వ) అరే ! యేమి ధైర్యం. యేమిదయ. బడా దొడ్డమనిసీ హై.

అబాజీ—దేవర భావమునకు వ్యతికరణము సేయువాడను కాను.

శివా—ఓయీ ! యవనప్రభువా ! నిన్ను మేము సగౌరవముగ విడచినాము కావున నీ యిచ్ఛ వచ్చిన చోటికి బొమ్ము.

సుబే—అఛ్ఛామహరాజ్. మీాది మోహం మాట అని యిదిమొదట. తలచుకొన్నాది. యిప్డు ఐతే మీాది సత్యమూర్తికా మాలుం హోగయా. మీాది ధర్మాన్కి తంటాల్ పడతాది గన్క మీాకీ జయం కావాల. మీాకీ మాకీ స్నేహం వుండాల. సలాంకరతాహుం. ఆజ్ఞా యిప్పించావాల.

శివా—మంచిది. విచ్చేయుడు.

సుబే—(నిష్క్రమించును)

శివా—ఓయి అమాత్యవర! అక్కడి యుద్ధవార్త లేమి. సవిస్తరముగా జెప్పుము.

అబా—దేవా! యవధారు.

గీ. మావళే సైన్య జలధర ♦ మాల నుండి
కురియు శర వర్షమునకు జ ♦ క్కి వడి యవన
బలము విరియంగ దుర్గాధి ♦ పతియు జిక్కె
వెంటనే హస్తగతయయ్యె ♦ విజయ లక్ష్మి

శివా—ఓయీ! నీ సాహసంబునకు మెచ్చితిని. మీ కందఱ కొక్కొక నెల వేతనము బహుమానముగ నిచ్చెదము.

అబా—శివరాయ! మీ పూన్కి నెఱవేఱుటయే మాకు సంతోషకరము. మఱియు నొక విన్నపము.

ఉ. ఆ జయలక్ష్మి, షోడశ క ♦ ళాలయ, రాజ్యరమా లలామ, వి
భ్రాజిత దేహవల్లి యజ ♦ రామర లోక సతీ మతల్లియున్
రాజితమైన హర్షకల ♦ నా వలమాన ముఖాబ్జ సీమయా
నా జలజాయతాక్షి విజ ♦ యాంకముగాఁ గరమున్ గ్రహింపుడీ

శివా—ఓయీ! అబాజీ!

ఉ. ఎప్పుడు వాని కోటను జ ♦ యించి విరోధిని బట్టి తెచ్చితో
యప్పుడె చిక్కలేదె మన ♦ కా జయలక్ష్మి శుభప్రదంబుగా
నిప్పగిదిన్ వచింప గత ♦ మెయ్యది త్వాదృశులైన ధీనిధుల్
దప్పక నన్ను గొల్వ నరు ♦ దా విజయంబును బొంద మిత్రమా!

అబాజీ—దేవా! మీరు వేఱె యోచన సేయుచున్నవారు.

నేను సంగ్రహించి తెచ్చిన ప్రత్యక్ష జయలక్ష్మిని పాణిగ్రహణము చేసికొమ్మని ప్రార్థించు చున్నాడను.

శివా—ఏమీ ! ప్రత్యక్ష జయలక్ష్మినా తెచ్చితివి. (ఆశ్చర్య మభినయించును)

అబాజీ—చిత్తము. దేవర స్వీకరింతురు కాక. (తెరవంక జూచి) సేవకా ? ఆ పల్లకిలోనున్న యామె నిటకు దోడ్కొని రమ్ము.

సేవకుడు—చిత్తము. (నిష్క్రమించి యథోక్త స్త్రీతో ప్రవేశించును)

(అంతట గుప్త ఖడ్గమై ముసుగు వెట్టుకొని యొక
యవన స్త్రీ ప్రవేశము)

శివాజీ—ఓయీ ! ఈమె యెవరు.

అబాజీ—దేవా ! ఆ కళ్యాణ దుర్గమును ముట్టడించిన సమయమున నీ యవన కాంత నా కంట బడినది. అంతట నే నీమెను సగౌరవముగ దేవర కొరకు దెచ్చితిని. కావున దమ రీమెను పరిగ్రహింతురు కాక.

శివా—శివశివా ! ఎంతమాట పలికితివి ! (చెవులు మూసుకొని) ఇట్టి దారుణమైన మాట నా చెవిని బెట్టినందుకు నాకు మిత్రుడ వగుటచే బ్రతికిపోతివి. ! మూర్ఖుడా ! ఇపుడు మనయుద్యమ మేదియో యెరుంగుదువా !

అబా—(తెల్లపోయి భయకంపములతో) చిత్తము. చిత్తము.

శివా—ఏదది. వేగ చెప్పుము.

అబా—స్వధర్మ ప్రతిష్ఠాపనము.

శివా—ఈ కార్య మెందువలన మనకు ముఖ్యాచరణీయమైనది.

అబా—మన మత ధర్మములను యవనులు విధ్వంసంబు సే
యుటచేత.

శివా—అందు ఘోరమైన వినరాని దేది?

అబా—హిందూస్త్రీల నవమాన పఱచుట.

శివా—ఇప్పు డీ యవన కాంతను నేను చెఱపట్టుట ఘోర
ము కాదా!

అబాజీ—దేవా! చిత్రము. (కాళ్లమీద బడి) మహాత్మా!
అపరాధము జేసితిని. మన్నింపుము.

శివా—

మ. అకటా! కర్ణకఠోరమై కుజన సే ♦ వ్యంబై మహాఘోర నా
రక మార్గంబయి నింద్య హేతువయి సా ♦ రా చార విఘ్నంబునై
హిత వాంఛ ద్వయభంజకంబు సుఖ సా ♦ హిత్యంబునై ఘోర పా
తకమౌ నట్టి పరాంగనా రతికి సి ♦ ద్ధం బౌదురే సజ్జనుల్.

ఛీ! ఇక నీ మోము జూడకుము.

అబా—అక్కటా! ఇక నా బ్రతుకేల.

సీ. సిగ్గుమాలిన వాడనై ♦ శివకుమారు
నఘ జలధి ద్రోయుటకు సి ♦ ద్ధమైతి నకట
కాల్పకుందునె యీ పాడు ♦ కట్టెఁ; గాదు
ఖడ్గమున జత్తు నగ్నికి ♦ కలుష మేల.

(అని కత్తిచే పొడుచుకొన బోవును)

శివా—(వారించి) ఓయీ! అజ్ఞాన నిద్రాంధుడవైన నీవు
పశ్చాత్తప్తుండవైతివి. సుజ్ఞాన ప్రభాకర తేజంబునఁ గన్నుల విచ్చి
చూచితివి. ఇది ప్రథమాపరాధమని మన్నించితిని. తాళుము.

అబాజీ—మహాత్మా! భవదీయ కరుణారసమున విద్యల నేర్చి నాగరికుడ నైనను తొల్లింటి యాటవిక స్వభావమువలన జనించి యసద్వాక్యము నా హృదయము దగుల బెట్టుచున్నది. ఇంక నే నెట్లు తమ యెదుట జీవింప గలను.

శివాజీ—ఓయీ! ఈనీతి ప్రపంచమునకు విశ్వసనీయమని వెల్లడి యగుటకు దైవ ప్రేరితమున నీచే నాచరింపఁ బడినది కాని నీ నైసర్గిక మది కాదు. కావున నీకే దోషము లేదు.

అబా—అట్లైన యుక్తి యుక్తములైన మీ సాంత్వన వచనములచే జీవించి కొంచెము సిగ్గుచేత సంచరించెదను.

శివా—ఓ అమాత్యులార! సైనికులార! మీ కెల్లరకు నే నిదె యాజ్ఞాపించు చున్నాడ వినుండు.

చ. కనులకు దోచినట్టి రిపు ♦ కాంతల నైనను మాతలట్ల నె
మ్మనమున జూచి పుత్రికుల ♦ మాదిరి వారల సత్కరింపు డీ
చెనకిన వారి శీర్షములఁ ♦ జెండి నగంబులకున్ దగిల్చి ధా
త్రిని జను లెల్ల దుష్కృతిఁ జ ♦ రింపక యుండఁగ జేసెదన్ సుడీ.

నేతా—దేవా! అట్టి దుష్కృతియే కదా! అనేక రాజుల ప్రాణ భంగమునకు మూలకారణ మైనది.

శివాజీ—అమాత్యులార! మఱియు,

గీ. భూసుర కులంబు నకును గో ♦ వులకు హింస
సేయు ఖలులనెట్టి ని ♦ గ్రింప వలయు
నైకమత్యము భరత ధ ♦ ర్మాసనంబు
దేశ సౌఖ్యంబు లాత్మ జిం ♦ తింప వలయు.

అబా—శివరాజా!

సీ. నోటనశ్లీల మొక్కడు • నుడువు కతన
మానసంబు దహించెడు • మాన్యచరిత
మూఢుడగు నన్ను దయతోడ • బ్రోవుమయ్య
జ్ఞాన ముదయించె మీ కరుణారసమున.

శివా—ఓయీ ! పాపము శమించునుగాక. (స్త్రీతో) సోదరీ ! నీ వెవ్వతెవు. నీ యెడల మా మంత్రి చేసిన యపరాధమును క్షమించు చున్నగాక. నిన్ను నా సోదరినిగా భావించి మాటలాడు చుంటినికాని వేఱుకాదు. నీ వృత్తాంతమును జెప్పితివేని నీ నిలయమున కనిపెద్దను.

స్త్రీ—మహారాజ్ పితాజీ సలామ్ కరతీహుం. ఆప్కా ధర్మ బుద్ధిసే మేరేకు బహుత్ ఆనందహోగయా. మీకే సమాన్ ధర్మమూర్తి యహాంసబ్ ప్రపంచమే కుచ్ నహీ. తబ్ తలగ్ ఆప్కా కళ్యాణ్ హువాహై.

శివా—అమ్మా ! నేనొనరించిన ఘనకార్య మేమియు లేదు. సకల స్త్రీ మానరక్షణము ప్రతి నరునకును కర్తవ్యమే. ఈ నీ సోదరుల యెదుట నీవు స్వేచ్ఛగా పీఠముపై దయచేసి నీ వృత్తాంతమును జెప్పుము.

స్త్రీ—మహారాజ్. మై క్యాకహానా? సుబేదార్ కా స్నుషా హుం. మై ప్రాణనాధకా వార్తా ముఝెకుచ్ మాలుంనహీ. సంకోలా సంగ్రామమే రహాతీహై ఉస్ వఖత్ యహీ అబాజీ మేరేకు ప్రత్యక్షహై. లేకిన్ ముఝె ప్రమాదకరణేకు తయార్ హైతో ఉన్కా మాతాసేకు మై తయ్యారహుం క్యాహోయిథా. పితాజీ దేఖోయహికరవాల్ (అని కత్తిజూపును)

శివా—అమ్మా! నీవు నిజముగ వీరవన్నెవి. నా సేనలో నొక్కైన శ్రీ కదంబమునకు నవమానము కలుగ జేయునని తలంపకుము.

ఉ. అమ్మరో! వీరమాతవు గ • దమ్మ త్వదీయ పవిత్రమా చరి
త్రమ్ము సతీమతల్లులకు • ధర్మపథంబుగ ఖ్యాతి జెందె నే
మమ్మున బంపువాడ జను • మా యనుమానము లేదు నీ నివా
సమ్మునకున్ సహాయముగ • సైన్యము బుత్తును పుత్రికామణీ!

శ్రీ—అచ్ఛ మహారాజ్! ఐసా సేయడానికి షందేహం నై. కాని మీకి ఉపర్ యేకు ఫుకాఫ్ పడినాది. అది యేమ్టి అంటే మాది కులం [illegible]రన్ సేయడానికి మీది కంకణ్ కట్టినట్టు సెప్తార్. అభినూస్తే అది జూటామాట. మీది బడా ధర్మబుద్ధిహై. అచ్ఛా దేశభక్తిహై. అయితే మాది దిల్మేయేక్ షందేహం తకురారు సేస్తా వుండాది. దయవుంచి సెప్పితే అడుగుతాం.

శివా—నీ కా సందేహ మక్కరలేదు. నేను తగిన ప్రత్యుత్తర మిచ్చెద నడుగుము.

శ్రీ—పితాజీ! నమస్కార్ కరతహుం. అయితే మాదిసేన సంపి ఖోట బద్దలి కొట్టి గందర్గోలం సేసి మాకి మామకీ సెఱపట్టి యుడిసి పెడితే మీకీ యేమి ఫాయిదా

శివా—అమ్మా! నీవు చక్కని ప్రశ్న జేసితివి వినుము.

శా. జాతిద్వేషము లేదు మీ యెడల లే • శంబైన మతోన్నదర [illegible]
వ్రాతంబున్ బరిమార్ప సిద్ధమగు దు • ర్మార్గాళి శాసించి ప్ర
ఖ్యాతిం జెంద స్వధర్మము న్నిలిపి యా • త్కార్యంబు సంధిల్ల భూ
మాతన్ గాచుటె మాకు గంకణము మ • మ్మాత్రమ్ము ముమ్మాటికిన్

కావున, హిందూమత ధర్మ విధ్వంసన మొనర్చు యవనులు మా

తర్వమే మాకు శతృవులని తలంచవలెను. అట్టి దేశ ద్రోహి భారతీయుడే కాడు. నా సుతుండైనను నాకు బరమ శతృవని తలంచెదను. దేశక్షేమము గోరువాడు యే జాతివాడైనను నాకు గురుసదృశుడు వానిని నేను భగవంతునిగా బూజించెదను.

స్త్రీ—సచ్ హై సుబా రాజా. అధర్మకార్యం మాదీ కులానికి కూడా సెప్పాలేదు. మాది కులంలో కొందర్ ఐసా సేస్తా వుండార్ మహారాజా! మీకీ సలామ్. మీది కులం వృద్ధికావాల. మీకీ అల్లా సాయవడవాల. మాకీఆజ్ఞా యిప్పించి పంపితే యెళ్లిపోతాం.

శివా—సందియ మేమి. అటులే వెళ్లుము. ఓయి అబాజీ! భద్రముగా నీవె నిచ్చవచ్చిన చోటికి గొంపోయి విడచి రమ్ము.

అబాజీ—స్వామీ! మహాప్రసాదము. అమ్మా! మీరా పల్లకిలో కూరుచుండుడు.

స్త్రీ—పితాజీ! నమస్కార్ కరతీహూం. మై చలేగావుంగా.

శివా—అమ్మా! మంచిది.

స్త్రీ—
అబాజీ— } (నిష్క్రమింతురు)

శివా—ఓ సచివాగ్రణి!

మ. తొలుతన్ దుర్గము లాక్రమించుటయు దోపిళ్లోవారిడా నాల్గుల
క్షల ద్రవ్యంబును దోచుకొంట విని చం ॥ చత్స్వాంతుడై కోపమ
గ్గలమై బీజపురీశు డాహవము సం ॥ కల్పించి వేవేల సే
నలచే కోటల ముట్టడించునో యనూ ॥ నశ్రద్ధతో నుండరే.

నేతా—దేవర యాజ్ఞానుసారమున మన సైన్యముల నట్లే

యుండ నియమించితిని.

సేవకుడు.—మహాప్రభో ! ద్వారముకడ కొందరు తురుష్కులు తమ దరిశనమునకై వేచియున్నారు.

శివా—మంచిది. ప్రవేశపెట్టుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించి మరల కొందరు తురుకలతో ప్రవేశించును.)

ప్రథముడు—
అందరు తురుకలు— } మహారాజా సలామ్.

శివా—సోదరులార ! మీకు శుభమగునుగాక. మీరేపని నిమిత్తమే వచ్చితిరి ?

ప్రథముడు—మహారాజా ! మాది కళ్యాణపూర్నామె నివాసం మీకె జయించినాక్. మాకీ నౌఖరీకి తుమారా దర్బార్ మే వంపాదన్కు మేము షాలా మంది వచ్చినామ్.

శివా—అలాగునా ! తెలిసినది కాని మీరెల్లరు మా యాజ్ఞలకు బద్ధులై ప్రవర్తింప వలెను. అందులకు సమ్మతించితి రేని మిమ్ముల నందఱిని బోషించెదము.

ద్వితీ—హజరత్. మీది అన్నంతింటూ మీది ఆజ్ఞకి వ్యతిరేకంగా పేస్తే మాకీక్యా ఫాయిదా మహారాజా. అట్లాగే ప్రమాణం కూడా సేస్తామ్ ఆజ్ఞాపించండి.

శివా—గోబ్రాహ్మణ హింసయు పరసతీ పరత్వము కలనైన తలంపమని ప్రమాణము సేయుడు.

ప్రథము—మహారాజా ! దీన్కి యేమీ సందేహం లేదు. ఆలా సేస్తే మై అల్లాకోడు మహరాజా. నాల్కి సీల్సి యేయావాల.

యిది తురకపిండం. అమ్మ అంటె అమ్మ ప్యాకి [illegible] ప్యాకి కావల. యిది అగ్గీలో పురఖమంటే పురుకుతుంది. క్యా బాబా మీాది ఆజ్ఞ తప్పితే మృదాక్ తిన్న దోసం మాకీ వస్తాది.

శివా—అట్లయిన మీారు జాతివైర మెంచక ఐకమత్యముతో మా సేనలతో బాటు పని చేసెదరా!

పఠిధము—
అందరు— } సచ్ హై మహరాజ్ కుచ్ ఫికర్ నై.

శివా—ఓ మంత్రి పుంగవా! వీరలను గూడ మన సేనలోనుంచి సాంగ్రామిక ధర్మముల నుపదేశింపుమని దేశికాచార్యులవారికి దెలుపుము, పై బడనున్న తురుష్క వ్యాఘ్రమునే సర్వదా విలోకించుచుండుము. సాయంకాల వ్యాయామమునకు వేళ యైనది గనుక పోవుదము రమ్ము.

నేతా—చిత్తము (అందరు నిష్క్రమింతురు.





శ్రీ

# మహారాష్ట్ర విజయము.

## తృతీయాంకము.

రంగము—బీజపూరు సుల్తాన్ కచ్చేరి.

(బీజపుర సుల్తాన్ ఆడిల్ షహా, అఫ్జుల్ ఖాన్, పంతాజీ గోపీనాథుల ప్రవేశము—బాజీ ఘోరపడే ప్రవేశము)

సుల్తాన్—క్యా హై వజీర్. అఫ్జుల్ ఖాన్ జీ! దుష్టబుద్ధి అడవి దొంగ షివాజీ మొదట హమారా తోరణా ఖిల్లాకి ష్వాధీనం సేస్కొని అనంతర్ మాది ఖజానా దోస్కొని మేరా సబ్ రాజ్యం మెల్లంగా మెల్లంగా దోల్చు తుండాడ్. యిప్డు మనం వూరూఖుంటె మీరీపో తాడ్, దీనికి తగిన యోచన్ సేయూవాల.

అఫ్జుల్—హజరత్ సుల్తాన్ జీ! ఓలడ్కాకి యింత యోచన్ సేయడ్డాన్కి కుచ్ కారణ్ నహీహై. హమారా పాణిమే మిస్ ఖిల్లా సేసి ఉన్కా మసలమ్కొఖాడికి పంపిస్తాం. క్యా యోచన్ మహారాజ్.

బాజీ—సుల్తాన్ ప్రభువుగారు! మీ యాజ్ఞానుసారము శివాజీ తండ్రియైన శహాజీని భోజనమునకని పిలిచి మీ శాసన పత్రమును జూపి ఖైదు చేసితినికదా! అంతటితోనే వాడు మీ పాదాక్రాంతుడు

కాగలడు. లేకున్న నే నెట్టులో వానినికూడ పట్టి యిచ్చెదను. సందే హించకుడు.

గోపీనాధుడు—ఓయి వెఱ్ఱివాడ! అది వట్టి స్వప్నవార్త. ఆ శివాజీసంగతి నేను చెప్పెదను వినుము. వానికి గలిగిన యవనద్వేషము పుట్టిన నాటనుండియు గలది కాని మధ్య కలిగినదికాదు. అందు వలన నే మొదటినుండియు మ్లేచ్ఛ సేవకుడని తన తండ్రినైతము బహిష్క రించి స్వేచ్ఛావృత్తిని దిరుగుచున్నవాడు. వాడు శహాజీని చెఱ వెట్టి నంత మాత్రమున వాడెంతమాత్రము తన యుద్యమమునకు వెనుదీ యువాడు కాడు. మఱియు నీవు తన తండ్రియెడల చేసిన కపటకృత్య మునకు మాత్రము నీ పేరు దలచిన మండిపడుచు నిన్నెప్పుడు సంహరిం చుదునా యని తలచు చుండును. నీ విక మాత్రము వానిని కంట బడ వలదు.

ముల్లా—సచ్ బాత్ హై గోపీనాథ్. వాడు బడే మోసగా డు. బహుత్ షౌర్యంవుంది. లేకపోతే సూఫుల్ కు సుంచూశిల్లావాలె వుండి దర్బార్ మే మాకీషలాం సేయాలేదు. యేమిఅంటే పిల్లవాడు అని శహాజీ సదిర సెప్పినాడు. బాజీగారు మీరు యెల్లి శహాజీని బాగా జాగర్త సేయావాల.

బాజీ—చిత్తము. (నిష్క్రమించును)

అఫ్జుల్—హాజరత్! షౌర్యం వుండుగాక. మాది అఫ్జుల్ ఖాన్ పేరు సేప్తె షౌర్యం గీర్యం అంతా మరగయా అవాల. దేఖో మే రాపరితాప్.

సుల్తాన్—అచ్ఛహాంజీక్. ఆపకా పరితాప మొఱ్ఱమాలుం హోగయా.

(అంతట రుస్తుంఖాన్ ప్రవేశించును)

రుస్తుం—హాజరత్ మహారాజ్ సుల్తాన్‌జీ సలామ్.

సుల్తాన్—రుస్తుంఖాన్ క్యా! కళ్యాణ్ హాలో జావేగి కా శేషహాలోనా జల్దీకహాలో.

రుస్తు—క్యా కహానా మహారాజ్. ఒకటి వెనక ఒకటి యింకొకటి వెనక యింకొకటి గయా చెలేగయ.

సుల్తాన్—అరే యేట్టి తిన్నంగా సెప్పూరే!

రుస్తుం—మహారాజ్! తోరణాఖిల్లా దొంగాకి సిక్కే. సుబేదార్ పంపు ఖజానాకూడా యెల్లిపోయె.

అప్జు—అరే అదివంగాతె సుల్తాన్‌జీ యినేవుంది. తర్వాత సెప్పు.

రుస్తుం—తోరణాఖోట మరమ్మత్ సేస్తుండంగా బడా పైకం గుట్ట దొరికింది. మేకేకు కడుపు వుబ్బింది.

సుల్తాన్—క్యారే పైసా మిలేక్యా.

రుస్తుం—సచ్ హై మహారాజ్. బలే బలే గొప్పాగొప్పా గాబుత్ దొరికినావ్. ఆ పైకంబెట్టి యింకా యేకుకోట కట్టినావ్. రాజగడ్ పేరు పెట్టినావ్. క్యా కహానా బడా భయంకర్ దుర్గ హై.

గోపె—ఓయీ! దాని సమీపమున నింకొక క్రొత్తకోట నిర్మించినాడా యేమి?

రుస్తుం—అంతేకాదు మహారాజ్. శివాజీకి మామ బాజీమోహితేను చెఱాబెట్టి సుపాపరగణాన్‌కూడా స్వాధీనం సేస్కొన్నాడు.

అప్జు—అరరే! సుపాకూడా చెలేగయా క్యా!

రుస్తుం—అంతేకాదు. కోండాణాదుర్గం కూడా యెల్లిపోయింది.

సుల్తా—ఓ ఖిల్లాదార్ మరగయా క్యా!

రుస్తుం—నై నై. ఒంచెం గడ్డిమేసి మీాది దుగ్గం ఉన్నా సే తీలో పెట్టి కుత్తా అయి తిరుగు సుండాడ్.

సుల్తాన్—క్యా హై వజీర్! రుస్తుంఖాన్ మాటల్ మాది దిల్కా గుండు దెబ్బల్వాలె తగులు సుండాయి.

అఫ్జు—ఆడిపని యెంత మహారాజ్! సిటికలో కలాస్ చేస్తాన్.

రుస్తుం—సిటిక గిటిక మాకీ తెల్వదు. నీలకంఠ్ హై బతరావు మరగయా. పురందర్ దుర్గ పెలేగయా! కాంగారి, తికోనా, లోహగడ్, భోరప్, ఖేలనా అన్నికోటల్ యెల్లిపోయె. అంతకు ముందే తళే, ఘోసాళే, రాయకిఖలాల్ సేత సిక్కె యేమిసెప్పన్ మహారాజ్! అడవిమావల్ వాళ్లు అందర్ వానికి సేన, అయ్యె కుక్కల్వాతె తిరుగుసుండార్. చావుమంటె సత్తార్ బతుకుమంటే బతుకుతార్.

సుల్తాన్—అరే బదాత్మ్! అరే చండాల్! మాకీ ద్రోహం యెంత తలసీనావ్ రే! అరరరరే! బడాబడా ఖోటల్ లాగీయేసినాడు. క్యా హై వజీర్! యింకా యింకా వూరుకుంటే మీాదిపోయి మనిసిన్ కూడా దోలుసుతాడు. యెంత రాజ ద్రోహం తలను తుండాడు.

అఫ్జల్—మహారాజ్! ఆడు దొంగ భడవ. బ్రతుకుమీాది. జట్టమీాది. అన్నం మీాది. అంతామీాది. ఉన్నా మచ్చ మాపవాళ్లు వ్రుపేచ్చ సేస్తే హామాతా ఖుల్లాన్కి కూడా మోషం సేస్తాడు.

రుస్తుం—సుల్తాన్‌జీ! వాడు బలే దుంగ. బడా మోసకాడు. ఒకసోటు కాదు. ఒకతావు కాదు. అన్ని కొండల్ ఆడే వుంటాడు. భగవాన్కి కూడా దేఖ్నేకు మర్దూర్ నహీ హై. కైసా ఫద్దార్ మహ

రాజ్! యింకొకటి సెప్తాన్ యినండి. ముల్లానా సుబేదార్ కా సెఱయేసి సబ్ కల్యాణ్ ప్రాంత్ ష్వాధీనం సేస్కొన్నారు. తర్వాత సుబేదార కా కోడల్కు చెఱబట్టి తీస్కొని యెల్లినార్ ! శివాజీసూసి యిది ఖరాబ్ పని అని మంత్రికా ఖూకల్ యేసి కోడల్కు సుబేదార్కు మర్యాదసేసి యిడిసి పెట్టార్ !

సుల్తా—క్యారే కళ్యాణ్ హైతో సెలేగయా క్యా ! అరరే మాది రాజ్యంలో సగం యెల్లిపోయింది క్యా ! హై గోపీనాథ్ ! మనకీ యింకా యేమ్టి పాంతం పడాల? కాని షుబేదార్ కా యిడిసి పెట్టాన్కి కారణ్ యేమ్టొ తెల్వాదు. మనిసి సూస్తె పెద్దమనిసి. బుద్ధిసూస్తే దొంగబుద్ధి.

గోపీ—ఇందువలన స్వకార్యాచరణమే కాని శత్రుహింస కోర్వడని తోచు చున్నది.

రుస్తుం—సచ్ హై మహరాజ్ ! సుబ్ దార్కు సాల్లా మర్యాద సేసినాడు. కోడల్కు అమ్మా ! అని పిల్చి బడా గౌర్వం సేసినాడు.

సుల్తా—హాంజానా దేవు. మాకీ రాజద్రోహం తలంచినాడు. మాదీ రాజ్యం కొంత యెల్కావలె ద్లొలుసు తుంథాడు గన్క వానీకి మారక్ సేసికాని దీనికి నిద్దర్ రాదు, అరె అరే ! యెంతపని జరిగింది క్యారే ! దుంగ క్యారే శివా !

శా. క్యారే దుర్మతి యెంత సేసితివి దు ౹ ర్గాల్ దోచికొన్నావు క్యా
మేరా రాజ్యములోన బుట్టియును సా ౹ మిద్రోహమున్ సేయగా
నారంభించితె తిన్నకొంప బడ ద్రో ౹ యన్ జూచు చున్నావె నీ
మారణ్ పేసెద దేఖొ కొండ యెలుకా ౹ మాదీ తమాస్ దేఖ్తహుం

కోన్ హై వజీర్ ! ఉన్కా సెరా యేయవాల నహీతో ప్రాణం తీసివేయవాల. యేమ్ సెప్తావ్ ?

7/37

అప్జు—హాజరత్ !

శా. దేఖో మైపహ్రా కొండమెల్క నిదె నే ♦ తేకుంటె సాహేబనే
దాఖల్ సేసెద సిక్కెలోపలనె బం ♦ ధన్ జేసి నైతో ఖరాబ్
బేఖూబంచును నన్ను బిల్వవలె దే ♦ భేందుర్డు రచ్చింపనీ
యాఖిల్లాలను మీకి చేర్పుతము ఏ ♦ క్యా హై బిచార్ మత్ కరో.

సుల్తా—వహ్వారెవహ్వా ! తూ బడా సేనాధార్ హై. అచ్ఛా అప్జుల్ ఖాన్ నీకి తాఖత్ వుండాది. మేరేకు మాలుం హోగయా.

గోపీ—సుల్తాన్‌జీ ! మాయా సమర పాటవుడైన శివాజీని బట్టుటకు మాయానాటక సూత్రధారుడై మన అప్జుల్ ఖాన్ సాహేబుగారె సమర్థులు.

అప్జు—సెం షైర్! యిది మీనం. వాడు యెంత. పిచికె పిల్లావాలె పిసికి యేస్తాం. నహితో యిది అప్జుల్ ఖాన్ సింగంతో షివాజీమేకా లడాయిమే కైసా తయార్ అవతాది. అహహహహహా ! దేఖో హామారా ప్రతాప్.

సేవకుడు—(ప్రవేశించి) సలామ్ మహారాజ్ ! దేఖో యహి లేఖ్ (ఒక లేఖ నిచ్చును)

అప్జు—(చూచి) అరే అరే ! కొండమెల్క కైసాకీరహాతీహై దేఖో మహారాజ్ ! (సుల్తానున కిచ్చును)

సుల్తా—(చూచి ముక్కుమీద వేళ్లు పెట్టుకొని) అబి క్యా కరనా ? శహాజీకి యిడిసి పెట్టుమని షహాజహాన్ వుత్తర్వు అయింది గోష్టినాద్ దేఖో.

గోపీ—దేవా! అతడు మిగుల రాజకార్య ధురంధరుడు తన మాట సాగదని ఢిల్లీశునితో నేవేవో కొన్ని మాయమాటలు చెప్పి ఆ శివాజీ యిటుల జేయించినవాడు యిది నిశ్చయము.

సుల్తా—లేకపోతే షహాజిహాన్కి యేమి పంబంధం వుండాది. యిప్డు యేమ్టి సేయవాల. మాకీ పచ్చి యెలగకాయ కంథర్ మే లగానా అయింది.

అప్జు—మహారాజ్! మీకీ భయం లేదు. నాదిపేరు సెప్తె ఢిల్లీ గిల్లీ బూడ్దికావాల. ఆడు షహాజిహాన్ ముసలోడు అయినాడు కొడుకులుమాస్తే షాలా దూరంలో వుండారు. లడాయికి సిద్ధం అయితే అందరఖూడా అగ్గిపాల్ అవుతారు.

రుస్తుం—మహారాజ్! ఆడు శివాజీ మీ కంటికి తగలబోడు. మీరు లక్ష సెప్పు కోటిసెప్పు సాటుకుండా యెల్లీ పడాలి.

గోపీ—మహారాజా! ఇందులకై యింత యోజించ నవసరము లేదు. పౌరుషమే ప్రధానముగ మనము ఢిల్లీశ్వరునితో కలహము పెట్టుకొనిన నెగ్గనేరము. షాదుషహాకు గోపము రాకుండ శహాజీని విడచి పెట్టుము. తరువాత యే యుపాయము చేతనైనను శివాజీని పట్టుటకు బ్రయత్నించుడు.

సుల్తా—అచ్ఛబాత్ హై గోపీనాథ్. కాని, యింత కష్టంమీద మాయసేసి చెఱబెట్టి యప్పుడు యిడిసిపెడితే శహాజీకి కోపంవుండదా మారా కర్ణాటక రాజ్యంలో తాలూకాల్మె పన్న మోషం సేస్తే యేమి సేయావాల.

అప్జు—ఆ పైని యేమ్టెమి అవతాది. శివాజీని పట్టుకుంటె ఆడివని యెంత. కోటీలో మిటీయేస్తాం.

సుల్తా—అఫ్జల్‌ఖాన్ అష్లా అయితే సోపినాక్తా సాయం తీస్కా నిన్ గొప్ప సైన్యం పట్కాని సాటుకుండా యెళ్లి మాయసేత చెఱపట్టి తీస్కారావాల. లేకపోతే నరికి యేసెయ్యాల. అయినా సే యక్ పోతే మాఫీ దిగ్గరాని. తిండీ లోపల్కి పోదు. పైగా రాజ్యాం సబ్ చెలేగయా. మన్కు అందర్ మరగయా!

అఫ్జ—ఓ అచ్ఛ మహరాజ్! అందాకుమై తయార్ అయినాం.

గోపీ—నేనును ఖాన్ సాహేబుగారితోనే పోయెదను.

రుస్తు—మహరాజ్! ఖపడ్దార్‌గా యెల్లాల. తెల్సితే యెగిరి పోతాడు.

అఫ్జ—ఫర్వానై. దేఖో హమారా వరితాప్.

సుల్తాన్—అట్లైన భగవాన్కు స్మరణ్ వఖత్ అయింది. దర్బారు చాలించి పోదాము. (నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





శ్రీ

# మహారాష్ట్ర విజయము

## చతుర్థాంకము.

(యోగి రామదాసు ప్రవేశము)

కీర్తన.

రామదాసు—

రసనే భజ రామనామ, రఘుకులదీపక సునామ ॥రసనే॥
పాపహరణ కరణచణ, భవశృంఖల హరణ శాణ ॥రస॥
దుష్టనికర సంహరణ, శిష్టజన ప్రతిపాలన ॥రసనే॥
దేశవిప్లవాపహరణ, ధీరధర్మ ప్రతిష్ఠాపన ॥రసనేభజ॥

ఆహాహా! యేమి ఆశ్చర్యము?

గీ. ఐహిక సుఖంబులను నెల్ల నవల ద్రోసి
రామనామమె మోక్షమా ర్గంబటంచు
దిరుగు నాకును సైత మీ దేశసౌఖ్య
మునకు యత్నింప దోచెడు మనమునందు.

అది సహజమే? యేలయన సర్వజన-సమభావము సత్ప్రవర్తన, భూతదయ, స్వార్థత్యాగము ప్రతివానికిని యాచరణీయము లైనపుడు నేను మాత్రము మనుజుడను కానా?

గీ. ప్రజలు పడరాని కష్టముల్ పడుచు నుండ
దేశమున విప్లవము తట స్థించి యుండ
పాదములు రెండు కలిగిన పశువునకును
గాక నరులకు స్వాంతముల్ గరుగ కున్నె.

సీ. వై దేశికాధీన మై దీనతను జెంది
మాతృదేశము దుఃఖ మగ్నమయ్యె
ధాత్రి నెల్లర ధర్మ పరులచే బీడింప
బడి కేవలము శవ ప్రాయులైరి
క్రూర తురుష్కుల ఘోరబాధల విప్ర
కులధర్మములు నేల గూలబడియె
దుర్మార్గు లొనరించు దుష్కృతంబులకునై
పక పతివ్రతలు చా వగ దొడగిరి

గీ. ధర్మమూ లోపమయ్యె స్వా తంత్ర్య మడగె
పౌరుషము మూల దుంపతో భస్మమయ్యె
గటకటా! మహారాష్ట్రమీ కరణి చెఱను
బగుల గని యూరకుండుట మగతనంబె.

కావున స్వమత ధర్మముల పునరుజ్జీవింపఁ జేసి కొనుటకు గంకణము గట్టుకొనిన శివాజీకి దేశాభిమానమును బురికొల్పుటకు యాకుఁమీద గొన్ని శ్లోకములవ్రాసి యతని యుద్దేశము గనుగొన నే నంతర్హితుండనైతి అంతట నా సుగుణి యా శ్లోకముల జదివి పులకాంకిత దేహుం డయ్యె గావున మంచి నేలను నాటిన విత్తనమట్లు యితనికి జేసిన బోధ ఫలవంతమగును గనుక నింకొక లేఖ వ్రాసి యాతని కింకను భక్తి హెచ్చునట్టుల జేసెదను గాక. (నిష్క్రమించును)

(శుద్ధ విష్కంభము)

2—రంగము.

(శివాజీ మోరోత్రిమల పింగళేలు ప్రవేశింతురు)

శివా—ఓ మంత్రిపుంగవా!

గీ. అడవి మ్రాకుల యాకుల • యందు వ్రాయఁ
బడిన జ్ఞానోపదేశ వై • భవము లైన
యట్టి వృత్తమ్ములను నేమ • హాత్ము లేమి
కారణంబున లిఖియించి • నారలోకద.

మంత్రి—దేవా!

గీ. కన్నతల్లి పరాధీన • గతికి పొగల
సోదరులు చేవచెడి ఘన • శోకమంద
పశువువరు గాక మనుజుడై • పరగువాని
కెవని కభిమాన గుణ ముద్భ • యింపకుండు.

కావున నేమి కారణమో యేసనేల? హిందూధర్మ ప్రతిష్ఠాపనముకై కంకణము గట్టుకొనిన దేవరవారిని పురికొల్పుటకై సాధువులచే వ్రాయబడి యుండనోపు.

శివా—అమాత్య శేఖరా! సాధువు లనుటచే నాకు రోమాంచము గలుగుచున్నది. పాండురంగ భక్తుండును వైరాగ్య స్వరూపుండును నగు తుకారామ సాధు చంద్రుడు నన్ను రామదాసను యోగిపుంగవుని సేవింపుమనియు నంగువలన నిష్టార్థసిద్ధి యగుననియు నుపదేశించినది మొదలా మహాత్ముని దర్శనంబునకై మదీయ స్వాంతం బుత్తల పడుచున్నది. ఎట్లైన వాని సందర్శించుట మనకు ముఖ్య కర్తవ్యమై యున్నదికదా?

మంత్రి.—మహాత్మా! అది నిశ్చయమే. తొల్లి ద్వాపరయుగంబున నధర్మవర్తనమైన కౌరవాది రాజ చక్రంబును సంహరించుటకు అర్జునునకు శ్రీకృష్ణుండు గీతా వాక్యంబుల బోధజేసి ధర్మప్రతిష్ఠాపనము జేయించి నటులే తాము రామదాస బోధామృతమును దాగ నవసరమైయున్నది. ఆ మహాత్ముడు సర్వేశ్వరుని వలె మెందు జూచిన దానై యుండునని చెప్పుట వాడుకయై యున్నది.

శివా.—ఓయీ!

గీ. తొలుత జేసిన పుణ్యాంపు ♦ ఫలము వలన
గాక తాదృశమగు యోగి ♦ గణము జూడ
సంభవిల్లునె రాజ్య సం ♦ సార మగ్న
లకును మునులకు సఖ్యముల్ ♦ గలుగు టెట్లు.

(ఒక సేవకుడు ప్రవేశించి)

సేవకు.—మహారాజా! జయము జయము. దేవర కిమ్మని యొక భిక్షుకు డీ జాబు నొసంగి చనెను. (ఒక జాబు నిచ్చును)

శివాజీ.—(లేఖనుజూచి కన్నులనద్దుకొని హర్షముతో) మంత్రి సత్తమా! యేతల్లేఖావలోకమున బొడమిన యానందాధిక్యముచే గద్గద కంఠుడనై చదువలేకుంటిని. గాన నీవు దీని సాకల్యముగ జదివి వినిపింపుము.

మంత్రి.—(చూచి) యే మహనీయుని మన మిప్పుడు స్మరించుచుంటిమో ఆ రామదాస యోగిపుంగవునిచే వ్రాయబడినది వినిపించెద నవధారు.

ఓమహారాజా!

ఉ. మేరువు పోలె నిశ్చల మ ♦ మేయము నీదృఢ నిశ్చయంబు సొం

పారగ నీవె ధైర్యమున ♦ కావల మాశ్రయ భూమి వీవె యీ
భారత పుత్రపాళికి శు ♦ భంకర కీర్తి వతంస సద్యశో
దార శివావతార నిను ♦ ధర్మువు శక్తియు బ్రోచు గావుతన్.

గీ. హయపతివి గజపతివి ♦ దు ♦ ర్గాధిపతివి
నరపతివి ధనపతివి దా ♦ నరతి వీవు
సుప్రసిద్ధ చరిత్ర డే ♦ శోపకృతికి
గంకణమ్ము గట్టుకొన్న ♦ లోకప్రశస్త.

మా విన్నపము వినుండు,

సీ. బ్రాహ్మణ క్షేత్రముల్ ♦ పాడుచేయంబడె
మాదుతీర్థము లన్ని ♦ మంట లసె
వసుధా స్థలంబు వి ♦ ప్లవ పూర్ణ మయ్యెను
ధర్మమ్ము మొదలంట ♦ దగుల బడియె
శిష్ట పాలనమును ♦ దుష్ట సంహారంబు
సేయ నహార్హుండవు ♦ శివకుమార
నీ ప్రయత్నంబున ♦ నే మహారాష్ట్ర దే
శం బింతకును జీవ ♦ సహితమయ్యె

గీ. ధర్మ సంస్థాపనాచార్య ♦ ధన్య చరిత
మాతృదేశంబు నుద్ధరింపంగ నీవె
యర్హుడవు జ్ఞాని వీక నీకు ♦ నధికముగను
వ్రాయగాదాదు నిప్పూన్కి ♦ జేయ గదవె.

ఓ కళ్యాణ ప్రదుడవగు శివఛత్రపతీ! అనేక రాజ కార్యములకు వ
శుడవై యున్న నీకు బిల్లువని షేరంటమువలె నీయుత్తరము నంపినందులకు మన్నింతువుగాక,,

ఇట్లు హితైషి,

రామదాసు.

శివాజీ—ఆహాహా మంత్రిశేఖరా! నే నెంత ధన్యుడ నైతిని. ఆ మహానీయుడు నన్నిట్లు నుతించుటచేతను వారి సాహాయ్యముసంగిల నర్హత్వముల లో సహస్రాంశమైన నాకడ లేకుండుటచేతను నా కెంతయు సిగ్గగుచున్నది.

మంత్రి—దేవా! ఆ మహాత్ముడమృత వచస్కుడుకాడు. ఆయన వ్రాసిన యంశములును సత్యములే. పరస్తోత్రములకు సంతసించుట ధీరోదాత్త నాయక విరోధమగుటచే ప్రభువు లిట్లు పలుకుటయు నుచితమే!

శివా—మిత్రుడా! నీవీ తక్షణ మేగి యా మహాత్ము నెచటనున్నను దోడ్కొని రావలయును. ఆయనను జూచువరకు నా హృదయము తపించుచున్నది.

మంత్రి—దేవా! చిత్తము. (నిష్క్రమించును)

శివా—నా యుద్యమమునకు భగవతియే కాక యోగిజనులు కూడ మార్గదర్శకు లగుచున్నారు.

ఉ. ఏ మహనీయు లైహిక సు ♦ ఖేచ్ఛల నెల్ల దొలంగి రామనా
మామృత పాన జీవితమె ♦ యాచరణం బొనరింతు రట్టి ని
ష్కాములనైన యోగులును ♦ కష్టము నొందు మరాట భూమికై
మామక సత్ప్రయత్నముల♦మార్గము జూప గొలంత యుండునే

(అంతట రామదాసు మంత్రియు బ్రవేశింతురు)

శివాజీ—(నమస్కరించి) మహాత్మా! ఈ యాసనమున విచ్చేయుడు.

రామ—వత్సా! శివకుమార! ఆయుష్మంతుడ వగుదువుగాక!

శివా—ఆర్యమిశ్రా!

ఉ. ధన్యుడనైతి మీ చరణ ♦ తామరసంబులు సోకినంతనే

మాన్యచరిత్ర పావక స ♦ మాన పవిత్ర మదీయ వంశమున్
ధన్యతజెందె పాపములు ♦ దగ్ధములయ్యెను రామభక్త మూ
ర్ధన్య వివేకచంద్రమ స ♦ దాసుడ బ్రోవ గదయ్య మ్రొక్కెదన్

రాము—ఓయి శివకుమార ! నీ తలంపు నే నెఱుంగుదును. ఆర్యధర్మమును పునరుజ్జీవింప జేయుటకు గర్మయోగ ముపదేశింప వచ్చితిని

శివా—మహాత్మా ! నే నిప్పుకిగదా కృతార్థుడ నైతిని.

రామ—వత్సా ! వినుము,

సీ. మ్లేచ్ఛులు ధరణిపై ♦ స్వేచ్ఛావిహారంబు
సేయదొడంగిరి ♦ శివకుమార
సకల ధర్మములు భ్ర ♦ ష్టములయ్యె బ్రాహ్మణ
దేవతా వృత్తి య ♦ భావమయ్యె
కొందలంబునకుబల్ ♦ కుమ్మరైన యీ కాల
మందందరి సుఖంబు ♦ లడగిపోయె
నధికార మదమున ♦ యవనులు ప్రజలను
దండి బాధల బెట్టు ♦ చుండి రకట
గీ. ఈ దృశావస్థ జూచి స ♦ హింపలేక
రఘుకులేంద్రుడు నిన్ను ధ ♦ రాతలమున
నీశ్వరాంశోద్భవుగ సృ ♦ ష్టించెగాన
ప్రజలకు హితంబు సేయంగ ♦ వలయు బూని.

శా. వీరాగ్రేసర ధర్మమున్ నిలుప యుద్యుక్తవై యుంటచే
నారంభింపుము దుష్ట శత్రువుల సం ♦ హారంబు గావింప దో
స్సారంబున్ వెలయంగ ధర్మమును సం ♦ స్థాపించి దుష్కృత్యముల్
పారందోలవె దేశసౌఖ్యమును సం ♦ పాదింపవే ధీమణీ !

ఓ ప్రతాపవంతా ! శివఛత్రపతీ ! నేను చెప్పబోవునదియు నీవు చే
బోవునదియు కేవల మానవ కల్పితమై వట్టి మానవశక్తిచేత నిర్వహిం
పఁ దగినది కాదు. అది యంతరాత్మ ద్వారమున నీశ్వరునివలన సందే
శింపఁబడినది. నారాయణునిచే సంకల్పింపఁ బడిన కార్యము నరులచే
బ్రయత్నింపఁబడిన- దానివలె నశ్వర మగునది కాదు. శాశ్వతముగ
నుండునది. ఈశ్వరోద్దిష్టములైన కార్యములను పూర్తిగ గ్రహించుట
కు మన కధికారము లేదు. వాటియందు తాత్కాలికములైన పాత్రల
ను బ్రదర్శించుటకును తత్సంబంధమైన యానందము ననుభవించుటకు
మాత్రమే మన కధికారము కలదు. అవసర మెఱిఁగి కాలానుకూలముగ
నా యధికారము నెవరు నెత్తిని బెట్టుకొని నిర్వహించెదరో వా రవతా
ర పురుషులుగ భావింపఁబడి వీరస్వర్గమును జూఱగొందురు. దేశీయులై
న సోదరు లందరు పడరాని పాట్లు పడుచున్నప్పుడు గూడ సమర్థుల
య్యును యెవ్వ రుపేక్ష సేయుదురో వారు ఘోరనరకపంకంబునం బడి
తెవులు లేని వేదనం బనుదురు. రాక్షససంహార మొనర్చిన శ్రీకృష్ణభగ
వాను లస్తమించిన తరువాత మహమ్మద్ గజనీకాక మరెవ్వరును గో
బ్రాహ్మణహింస సేయువా రడుగు పెట్టలేదు. అత డయినను అప్పటికి
మన దేశము అవిద్యాంధకారమగ్నమై అనైకమత్యపూరితము కాకుం
డుటంజేసి యెంత బలవంతుండైనను మొగమున గుడ్డ వేసికొని వచ్చిన
త్రోవనే పోవలసివచ్చెను. దేశద్రోహియై జయచంద్రుఁడు గోరిని మ
న దేశమునకు బిలచినప్పటి నుండియు మనకీ గతి సంభవిల్లినది. యవను
ల వలన మనవారు పడు బాధలకు నవమానమునకు నుచ్చరింపరాని
యకృత్యలకును మేఱలేకున్నది. అట్టి బాధలకు దాళలేక ఈశ్వరశక్తి
యే పురుషసింహునియం దవతరించునా, నారాయణుఁ డేవిధమున దు

ష్టసంహారము సేయునా యని యెనుక చూడనివాడు నా కన్నంతవరకును విన్నంతవరకును నీ మహారాష్ట్రమున కనుపడడు. నా యనా! శివ ఛత్రపతీ! ఈ మహారాష్ట్ర దుఃఖమును నే నేమని వర్ణింతును.

సీ. ఏవైపు సను బ్రాహ్మ ♦ ణావమానమె తోచు
నేవీధి దిలకింప ♦ గోవధంబె
యెచట గాంచిన సాధు ♦ బృంద ఖేదరవంబె
యెందుజూచినను దు♦ష్కృతులగములె
ఏతావునను మ్లేచ్ఛ ♦ భీతియే చూపట్టు
నెందు బతివ్రతా ♦ క్రందనములె
ఎందాలకించిన ♦ హిందూ విరావంబె
యేవైపు గూర్చిన ♦ దేవళగులె

గీ. మన స్వతంత్రత మొదలంట ♦ మంట గలసె
బ్రాహ్మ ధర్మంబు మతమును ♦ పాడు వడియె
నిష్ఠయు నదియును బోయె నం ♦ చేమి చెప్ప
సకలమునకు వినాశంబు ♦ సంభవిల్లె.

శివా—మహాత్మా! మహారాష్ట్రావస్థ వినినంత నే నా యంతరాత్మ తగులబడియె. నా మేను కొయ్యబారుచున్నది.

రామ—వత్సా! భూతదయార్ద్రపరుల హృదయమ్ము లట్లుండుట సహజమే. ధైర్య మవలంబించి ప్రతిక్రియకు యోచింపుము.

శివా—గురువర్యా! ఆనతీయుడు.

రామ—వేయి చెప్పనేల! త్రిలోక కంటకుడగు రావణుని కాలమందు గాని మరియే రాక్షస రాజ్య కాలమున గాని యిట్టి దురవస్థ తటస్థింపలేదు, మన ప్రాణములు పోయినవన్న నాకు విచారము లేదు.

కాని, మన స్త్రీ పురుషుల మానాభిమానములును పవిత్రమైన యార్య మతమును గూడ భగ్నమయినది. వారు చేయు దురాగతములకు మనవారు పెదవి గదల్చినచో దమ ప్రాణములకు జలాంజలి నీయవలసినదియే. అందులకే నారాయణు డేయవతారమెత్తి ధర్మము దిరిగి సంస్థాపించునా యని ప్రజలు తపస్సు జేయుచున్నారు. తత్త్వజ్ఞులందరు నీ యందా చిహ్నము లున్నవని చెప్పుకొనుచున్నారు. ఉండనిమ్ము. ఉండక పోనిమ్ము. స్వధర్మప్రతిష్ఠాపనకై ప్రయత్నించు నీ కవి రాక మానవు. ప్రకృతి, ధర్మము, పరిపాలన, వివేకము, సుహృద్భావము మొదలగు విశ్వమానవ స్వాతంత్ర్యములను సూక్ష్మదృష్టితో విచారించిన యెడల నిట్టి సమయముల నవశకస్థాపనము అత్యవసరముగా కనుపట్టుచున్నది. యుద్ధము చేసినయెడల భటులతో గూడిన మనము మాత్రమే ప్రాణములను గోల్పోవుదుము. ఊరకున్నయెడల అబలలు గోవులు బాలురు గూడ ప్రాణములను గోల్పోవుట దటస్థమగునుగాన,

గీ. నిరపరాధుల జంపుదు • క్షితిపరుల
నెంతమంది ప్రాణంబుల • నిచ్చి యైన
జంపి రాష్ట్రమునకు మేలు • సలుపునట్టి
ధర్మమే సుమి యుత్కృష్ట • ధర్మ మరయ.

శ్రీకృష్ణుని చర్యలను బోధ పరచుకొనుము. భారతయుద్ధమున కతడే మూలకారణుడు. కావున నాలోచించుకొనుము. మఱియును

గీ. ఒక్క ద్రౌపది కవమాన • మొదవినంత
బహుళ సైన్యంబు ప్రాణముల్ • బాయ వలసె
నిపుడు తాదృశ సాధ్వుల • కెల్ల మాన

భంగ దశకల్గె నెందరు ◆ బ్రుంగవలెనో.

నాయనా! శివకుమార! తన పుత్రులును పుత్రికలును నిరంతర బోధనము చుండ గంటికి మంటికి నేకధారగా నేడ్చుచున్న మహారాష్ట్రము యొక్క యవస్థ మాన్పుటకు నేడొక్క శ్రీకృష్ణుడు కాక లెక్కలేని శ్రీకృష్ణులు కావలసి యున్నారు. అం దొక్కడైన దొఱకునా యని జనులు కలవర పడుచున్నారు. నీ వీశ్వరాంశ సంభూతుండవనియు నీ యుద్యమంబునకు దోడ్పడువారందరు నారాయణాంశ సముద్భూతులనియు దెలిసినవా రనుకొనుచున్నారు. దానికి నీ కేమైన సంశయ మున్న యెడల ,,అహంబ్రహ్మాస్మి,, తత్త్వమస్యాది మహావాక్యముల యర్థమును బోధ జేసికొనుము. నారాయణుని కార్యము లోకసేవ, స్వార్థత్యాగము. ఆత్మకు నాశనము లేదు. భౌతికమగు శరీరము మాత్రమే నశించును కావున మనము పోయినను మన కార్యములు నశింపవు. ప్రాణము తుచ్ఛము. ఐహిక సౌఖ్యము తుచ్ఛము. అపవర్గ సౌఖ్యము శాశ్వతము.

మ. ఎప్పు డవేళనో యెట్టి రూపముననో ◆ యేపుణ్యమున్ లేక వ్య
ర్థపుం జావొందుటకంటె నార్తులకునై ◆ ప్రాణంబు లర్పించి పూ
ర్వపు సౌఖ్యమ్ములను ధర్మము న్మరల సం ◆ పాదించి పోషించుటే
యపవర్గాత్మిక సౌఖ్యమంచు మది నూ ◆ హంజేయుమా పుత్రకా

ఈ కార్యము ఈశ్వరోద్దిష్టమని చెప్పియుంటిని. ఐహిక భోగంబులకాశించి ప్రాణభీతిచే మనము తప్పికొంటిమేని ఈశ్వర పుత్రులైన మరియొకరు దానిని నిర్వహింతురు. కాని, మనము మాత్రము ఘోర నరక పంకంబునం బడక తప్పదు. నీ కార్యమునకు భగవంతుం డనుజ్ఞ నిచ్చినాడు. సాధువు లాశీర్వదించినారు. భూదేవతలు దీవించినా

రు. పతివ్రత లామోదించినారు. గోవులు సంతసించు చున్నవి. అభినవ (శ్రీ)కృష్ణుడవుకమ్ము. పరావమానంబున స్త్రీ పురుషు లెందరో వృథాగా ప్రాణముల విడచు చున్నారు. ప్రభువు లోకవేళ విమతస్థు లయినను ప్రజలను బిడ్డలంబోలె పాలించి వారి మాన ప్రాణములను మతములను గాపాడ వలయు గాని యిట్టి దారుణకర్మమెందయిన గలదా ? కావున నీ వీ యుద్యమములో చతురోపాయములలో వీలైన దానిని సమయానుకూలముగా నుపయోగింపుము. భగవద్గీతల తత్వము బోధపరచుకొమ్ము.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః। పరధర్మాత్ స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః। పరధర్మో భయావహః॥

అను (శ్రీ) కృష్ణ బోధామృతము ద్రాపుము. నీవు కేవలము దుర్మార్గతనే సాధించు చున్నావు కాని మనుష్యులను కావు. సర్వావస్థలయందును స్వగౌరవ రక్షణమునే జపించుము. అదియే నీకు దపస్సు, స్వర్గము, మోక్షము, పరమార్థము, ఉత్కృష్ట ధర్మము. నీ ప్రాణములు, నీ శక్తి, నీ సామర్థ్యము నీవి కావు. నీ సోదరులవని యూహింపుము. నీవు లోకము కొఱకే పుట్టితివి కాన లోకముకొఱకే బ్రతుకుము. లోకము కొఱకే చచ్చిపొమ్ము. స్వధర్మ సంరక్షణయే నీ జీవయాత్రయందలి తత్వము ప్రాణార్పణమే నీ కీర్తి సందేశము. ప్రాణార్పణమేకాదు. తుచ్ఛమయిన ప్రాణము హృదయపూర్వకముగ నర్పించినను మానినను పోకమానదు. నీ సర్వస్వమర్పించు భక్తియే నీకు జేయు తత్వబోధ. వేయేల. ముముక్షుడవుకమ్ము.

శివా—వందే పితరం. (సాష్టాంగ దండప్రణామ మొనరించును)

రామ—వత్సా! లెమ్ము లెమ్ము. (లేవదీయును)

శివా—

చ. గురువర మీ సుబోధసల • కున్ రవిచే దమ మేగునట్లుగా
విరిసె మదీయ మైన యవి • వేకము ధన్యుడ నైతి నేను భా
సురతర పూరుషార్థమును • చొప్పడె మామక దేహయాత్రకున్
దెరువును జూపినారు సుగ • తి న్గనువాడ ద్వదీయ సత్కృపన్.

మహాత్మా! నా చిన్ని విన్నప మాలించి చంద్రునకొక నూలుపోగ నునట్లు నా సమర్పించు గురుదక్షిణ నంగీకరించుటకు మీ శిష్యుడు ప్రార్థించు చున్నవాడు.

రామ—(స్వగతము) ఈత డెట్టి దక్షిణ నిచ్చునో! అయిన గనుగొందును. (ప్రకాశముగా) ఓయి శివకుమార! సర్వసంగ పరిత్యాగినైన నాకు గురుదక్షిణతో నేమి ప్రయోజనము. అయిన నీ కోర్కె దీర్చెద. అట్లే యొసంగుము.

శివా—ఓరి సేవకా! అర్ఘ్యము.

సేవ—దేవా! చిత్తము. (అందిచ్చును)

శివా—మహాత్మా!

ఉ. ఓమహనీయమూర్తి సుగు • ణోజ్వల భూషణ యోగిచంద్రమా
మామక రాజ్యమ్మున్ సిరుల • మంత్రుల సైన్యముతోడ మీకు ని
ష్కామత ధారవార్పణము • గాగ నొసంగితి సర్వ సంపదల్
ప్రేమ మెలర్ప గైకొని ధ • రిత్రి నన్నున్ జరితార్థున్ జేయవే.

(రామదాసు చేతిలో నర్ఘ్యము విడచును)

రామ—ఓయి శివకుమార! నీ యిష్టప్రకారము పరిగ్రహించితిని. గురువునైన నా యానతి సైతము నీవు పరిగ్రహింపవలెను కదా!

శివా—మహాత్మా! శిరసావహించుచున్నాడను.

రామ—అటులైన బ్రజాక్షేమమునకై నా శాసనంబున నీ రాజ్యమును నీవే యేలుచుండుము. దేశబాధ దొలంగుటకై ప్రయత్నింపుము. నేను నీకిదే దాసబోధయను గ్రంథము నిచ్చుచున్నాను. దీనిని నిత్యము పారాయణ జేసికొనుచుండుము. నేను తీర్థయాత్రాచరణమునకై పోయెదను.

శివా—మహాత్మా! కొంతకాలమైన మీ రాజ్యమున నుండుట కంగీకరింపవలెనని వేడుచున్నాను.

రామ—ఓయీ! నీవు తలంచినప్పుడు సాక్షాత్కరించెదను. దేవుని యాజ్ఞ మాత్రము నిర్వర్తింపుము. నీకు బోధించునది వేఱేమియు లేదు. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందును స్వగౌరవము స్వగౌరవము స్వగౌరవమని తలంచుచుండుము.

శివా—గురువర్యా! భగవత్స్వరూపులైన మీ రమోఘ వచస్కులు గదా! ఎట్లు ప్రతిష్ఠింప బడకుండును.

రామ—వత్సా! నేను పోయి వచ్చెదను.

శివా—మహాత్మా! నమస్కారము.

అందరు—(నమస్కరింతురు)

రామ—మీకందరకు శుభమగుగాత. (నిష్క్రమించును)

మంత్రి—దేవా! ఛత్రపతి!

గీ. పార్థుడవు నీవె కృష్ణుడీ పరమయోగి

ప్రస్తుత రణంబె భారత ♦ రణము సుమ్మ
నాటి పాండవ జయమె యీ ♦ నాడు మీకు
సంభవించుట నిక్క మీ ♦ శ్వరుని కృపను.

శివా—ఓయి మంత్రీ! అది యంతయు గుర్వాజ్ఞా ప్రభావమే. నేడు మొదలు మన నికేతనమున నీ రాజ్యము రామదాసస్వామి రాజ్యమను చిహ్నముగఁ గాషాయాంబరమును బాధింపవలెను.

మంత్రి—దేవా! అది యుక్తమేకదా! అటులే చేయించెదను. ఓరి సేవకా! వినుచుంటివికదా!

సేవ—మహాప్రభో! నే నిదే పోవుచుంటిని. తెలివిగలవానికి జెప్ప నవసరము లేదు. (నిష్క్రమించును)

శివా—ఓ సచివాగ్రణీ! మన చారుల జాడ తెలియదాయె. ఔరంగజేబును చల్లని మాటలచే జోకొట్టి బీజపూర్ నవాబుపైకి యుద్ధమునకు బంపి మనము డిల్లీశుని జున్నరు అహమదు నగరములను దోచికొనినట్లు వినియుండి మన పైకి దాడి వెడలుట నిశ్చయము. మనము మాత్రము కడు జాగరూకతతో నుండ వలయును.

మంత్రి—దేవా! ఎవని తోడనో యొకని తోడ మన కిపుడు యుద్ధము సిద్ధమై యున్నది. సర్వము చారుల వలన నిపుడే తెలియగలదు.

(చారుడు ప్రవేశించును)

ఖాతర్‌ఖాన్—మహారాజ్కా సలాంజీ!

శివా—ఓయి ఖాతర్‌ఖాన్! వచ్చితివా! వార్తలేమి?

ఖాతర్—మహారాజ్! ఇది అన్ని దేశాల్ తిరిగి వచ్చింది. కాని, ఒక్టి సెడ్డకార్యం యిని వచ్చినాను. అది యేమ్టి అంటే మీాది కు

లంవాడు బాజీ ఘోరపడే బీజపూర్ సుల్తాన్ కాడవుండి బడా ఖరాబ్ పని సేసీనాడు మహారాజ్ !

మంత్రి—సాహేబు వేగ చెప్పుము ?

ఖాతర్—బాబు యేమిసెప్పన్. మహారాజ్కా పితాజీ శహాజీ మహారాజ్కా భోజనాన్కి పిల్చి మోసం సేసి ఖైదు సేసినాడు. అందుకు షహాజీమహారాజ్ మీకే సెప్పుమన్నార్. నాకీ కొడుకు అయితే బాజీ ఘోరపడేకు పాణంతీసి నాదివగ దీర్చుమన్నార్.

శివా—(కోపముతో) ఓరోరి స్వకులారణ్య సంహారకుఠార ! బాజీ !

గీ. తులసి మొక్కల గంజాయి ♦ మొలక వలెను
పరువమైన మహారాష్ట్ర ♦ వంశమందు
బుట్టి తుచ్ఛతకును నొడి ♦ గట్టినావె
వేగ నినుజంపి తీర్చెద ♦ బిత ఋణంబు.

ఓరోరి యవివేకశాలి ! ప్రభునాజ్ఞ నెరవేర్పకుండుట రాజద్రోహమని గర్వపడుచున్నావేమో. అదికాదు. నిజమైన ధర్మవర్తనగల రాజెప్పుడు నట్టి యకృత్యములకు సహింపడు. ఒకవేళ నా ప్రభు వందుల కంగీకరించిన నది యధర్మమని నిషేధించి సేవకులెల్లరు నా ప్రభువును బహిష్కారముచేసి వేఱొక ధర్మాధికారిని నియోగించుకొనవలెనుకాని యథారాజా తథాప్రజాః యను సూక్తి వలన సేవకులును ఆమార్గమునే యవలంబింప కూడదు. రాజత్వ మెప్పుడును ప్రజల క్షేమాభివృద్ధికి ననుగుణ్యమై యుండవలె గాని స్వోపయోగార్థమై ధర్మేతరముగానుండదగదు కావున,

గీ. భుజబలమె యున్న బ్రిత్యక్ష ♦ ముగను రిపుల

బట్టవలె కాని మాయచే • బట్ట నగునే
చెడుగు లేని కతమున నీ • చెట్టజేసి
కులమునకు మచ్చ దెచ్చితె • ములుచ బంట.

మంత్రి—మహాప్రభో ! ఆ తులువయొక్క వృత్తమెపుడు మీ చెవికి సోకెనో యప్పుడే వాడు చచ్చెనన్నిత్తలచితిని.

ఖాతర్—మహారాజ్ ! ఇంకా యేక్ చెడుగు కార్యం జరిగింది.

శివా—అటులైన నాలసించెద వేల ?

ఖాతర్—మహారాజ్ ! కనకగిరీ లడాయిమే మీాది అన్న షంభాజీ క్యామహారాజ్ ! మాకే నోరురాదు. యేమిసెప్తాన్.( అని యేడ్చును)

శివా—(ఆతురముతో) ఓయీ ! అపాయ మేమైన సంభవిల్లినదో !

ఖాతర్—అపాయమే కాదూ. మహారాజ్ మరగయా అయింది.

శివా—హా అగ్రజా ! హా పితృసేవా పరాయణా ! హా శంభాజీ !

ఉ. హా పితృభక్తి లాలన ! కృ • పాకర ! క్రూర తురుష్కరాజ సం
తాపిత దేశ సోదరుల • దైన్యముగాంచి సహింపలేక యీ
పాపపు లోకమందలి ని • వాసము నింద్య మటంచు నెంచి నీ
వాపురుహూత లోకసుఖ • మందగ బోయితివే సహోదరా !

మంత్రి—దేవా ! ఊరడిల్లుడు.

శివా—అయ్యా! మంత్రివర్యా! నా కేటుల యూరటకల్గును

ఆ. కారణాంతరమున మేము ♦ కలసి మెలసి
యొక్కతావున వసి ♦ యింప కున్నగాని
యొక్క తల్లి గర్భంబున ♦ నుదయమగుట
భరమయిన దుఃఖ మొదవొంగి ♦ పొఱలుచుండె.

ఖాతర్—బిచారే మర్కారో మహారాజ్! వారు లడాయిమే సచ్చినార్ వీరప్పగారికీ మెల్లినాన్.

శివా—ఓయి సందేశహారీ!

గీ. కాలు విరిగిన ప్రాణంబు ♦ కలుగుటకును
ప్రాణములువోవ వీరప్ప ♦ గఱంబు నకును
సంతసించెదు మనుజుని ♦ సంతసంబె
పొందుచున్నా నిటుల భావ ♦ మున్ విరక్తి.

మంత్రి—దేవా! క్షత్రియోచితమైన ధర్మమును బొందిన మీ సోదరునికై యప్రాజ్ఞులవలె విచారించెద రేల? యూఱడిల్లుడు.

శివా—ఓయి! మా యగ్రజుని మరణమునకు గారణ మెవ్వడో యెఱుంగుదువా!

ఖాతర్—మహారాజా! ఆడు బలే మాయకాడు. అఫ్జుల్‌ఖాన్ సాహేబ్ అన్యాయం సేసి మీాది అన్న శంభాజీగారు బేహద్బిగా వుండంగా మొసకపాటున వచ్చి నరికీ యేసినాడు.

శివా—ఏమి! అఫ్జులఖానా! ఓ కృతఘ్నమహాతకా,

చ. తెలివి యొకింత లేక నిజ ♦ దేశము మ్లేచ్ఛుల పాలజిక్కి నం
దుల కభిమాన మింతయును ♦ దోచక తావక దాస్యవృత్తినే
సలిపెదు నా సహోదరుని ♦ జంపగ నౌనె యధర్మ పద్ధతిన్
తులువ భవచ్ఛిరంబును బు ♦ ధుల్ వినుతింపగ దుంపకుందునే.

మంత్రి—దేవా ! యోజించిన యెడల నట్టి సిగ్గుమాలిన పని జేయుట వాని తల వాడె దున్నించుకొనుట. అట్టివాడే కదా జీవన్మృతుడు

శివా—అయ్యా ! మంత్రిశేఖరా ! ఈ వార్త మాత విన్న చో నెట్టిగతి సంప్రాప్తమగునో తెలియ కున్నది.

మంత్రి—మహాప్రభు ! ఈశ్వరోద్దిష్టమున కెవరేమి చేయ గలరు.

(అంతట జిజాబాయి ప్రవేశించును)

జిజా—(తనలో) ఏమిది ! నా కుమారుని మోము వీరోత్సాహము వదలియున్నది. ఈ చింతావేశమునకు గారణ మేదియో కదా (ప్రకాశముగా) వత్సా ! శివకుమార ! నీమోము విచారాక్రాంతమగుటకు గారణ మేమి తండ్రీ !

శివా—తల్లీ ! ఏమని చెప్పుదును.

గీ. అనవరత పితృభక్తిచే • నలరుచున్న
నీదు తొలిబిడ్డ శంభాజి • నాదు భ్రాత
కనకగిరిలోన నవ్విల • ఖానువలన
వీరభోజ్యము స్వర్గమ్ము • చూఱగొనియె.

జిజా—హా కుమార ! (మూర్ఛపోవును)

శివా—అమ్మా ! ఊఱడిల్లుము.

మంత్రి—తల్లీ ! ఏమి ? ఈవెఱ్ఱి సంసారము నిజముగ నాటకముగదా.

జిజా—(లేచి) హా నా కడుపు తొల్లింటి పంటా ! హా పుత్రకా !

గీ. సేవకులవృత్తి వలదని • చెప్పియున్న

గాని తండ్రిరి గూడియా ♦ కఠినుఁడైన
తురకలను గొల్చి ప్రాణముల్ ♦ దొఱఁగి నావె
ములుచ పోఱ కొలు వెపుడైన ♦ మోసమెకద !

శివా—అమ్మా! అతఁడు బుద్ధిపూర్వకముగ మృత్యుదేవతనే కొలచినవాఁడు. దైవప్రోద్దిష్ట మటులుండ మన మేమి చేయఁగలము. కావున నూఱడిల్లుము.

జిజా—నాయనా !

గీ. ఏది యెట్లైన బుత్రికు ♦ డీల్గె నన్న
మాటయె దవాగ్ని సదృశ మై ♦ మానసంబు
ఁగుల వెట్టెడు నెటులు శాం ♦ తమును గందు
గడకు ద్రోయ నగునె కన్న ♦ కడుపు దీపి.

శివా—తల్లీ ! ఏమి యీ వెఱ్ఱి !

గీ. ప్రచురమైన మహారాష్ట్ర ♦ వంశమందు
బుట్టియు నధీరవై యిట్టు ♦ పొగల నగునె
పుట్టువుం గన్న జను లెల్ల ♦ గిట్టకుండ
నట్టిగట్టుకు నూ రేగు ♦ చుంకురమ్మ.

జిజా—కుమార ! నీవు చెప్పినది సత్యమే. అయినను శంభాజీ యస్తమించినాఁడన్న విచారము లేదు. కాని, యీశ్వరకార్యమునకై తన ప్రాణంబు లర్పించక కేవలము క్రూర తురష్కుని ఖడ్గమున కర్పించి నందులకు దుఃఖించు చున్నాను,

శివా—అమ్మా ! సత్యము.

ఉ. మాతరొ దుఃఖము న్విడువు ♦ మా కపటంబున నా సహోదరున్
జ్ఞాతి విరోధ మెంచి రభ ♦ సంబున జంపిన దుర్మదాంధునిన్

బాతకు నా తురుష్క కుల ♦ పాంసను సబుల ఖాను జంపి నా
భ్రాతృ రుణంబు దీర్చెద ని ♦ రామయ మానటు సేతుధారుణిన్

(తెరలో రణభేరీ ధ్వని)

అందరు—(విభ్రాంతితో నాలకింతురు)

జిజా—వత్సా! నీ శపథము త్వరలో నగునని సూచన సేయుచున్నది వోలె భేరి మ్రోగుచున్నది?

శివా—అమ్మా! భేరీరవము కార్యసాఫల్య సూచకమే కాని అకాలమున నీ భేరి మ్రోగుట కేమి హేతువో తెలియకున్నది. శత్రుభేరియైన చారుడు రాకుండునా!

(పటాక్షేపముగా చారుడు ప్రవేశించును)

చారుడు—దేవా! రక్షించుడు.

శిజా—ఏమిరా అది! ఎవరివల్లనుండి?

చారు—స్వామీ! శత్రువుని బారినుండి.

శివా—మన కోట నెవడైన ముట్టడించెనా! ఎవడు?

చారు—మహాప్రభో! బీజపురమునుండి అఫ్జల్ ఖాను సాహెబు దండుతో కోటను ముట్టడించెను.

శివా—ఏమీ! అఫ్జల్ ఖానె వచ్చెనా? ఇక నేమి!

గీ. ఏదురాత్ముని వధియింప ♦ నే ప్రతిజ్ఞ
బూనితినొ వాడె యఫ్జల ♦ ఖాను డిపుడు
బవరమునకు దనంత దా ♦ వచ్చియుండ
విడతునే వాని జంపక ♦ వెఱ్ఱి నగుచు.

ఓరీ! నీవు వేగ పోయి సమరసన్నాహమున నుండవలెనని మన సైనికులతో నా యానతిగా జెప్పుము.

ఖాను—దేవా! చిత్తము. (నిష్క్రమించును)

ఖాత—మహారాజ్! వాడు అప్జల్‌ఖాన్ బలే మోసకాడు. తీయన్ మాటసెప్పి మాయస్నేహంసేసి మోసం సేస్తాడు. బడా జూటామనిసి హై బాబు.

జిజా—నాయనా! అప్జల్‌ఖాన్‌వృత్తి మన ఖాతర్‌ఖానునకు దెలియునని తోచుచున్నది.

ఖాత—అమ్మా! ఆడి సంగాతి మేరేకు బాగా తెల్సు. యేమ్టి అంటె యిది అక్కడ సిన్నప్పుడు కొల్వు పల్పింది. ఉన్కా దయా నై ధర్మం నై. బడాయి యెక్వా. దేహబలం కంటె మోసబలం యెక్వావుంది.

మంత్రి—అది నిశ్చయము. నేనును వదంతియు నట్లె విని యుంటిని.

గీ. కృత్రిమమె ధరణియందు మూ ♦ ర్తీభవించి
కఠినుడైనట్టి యప్జుల ♦ ఖాను పేర
వ్యవహరింపంగ బడుచుండె ♦ నందు వలన
మాయ వలననె చంపుడా ♦ మాయకాని.

శివా—అంత మాత్రముననే వాని నట్లుగా తలచుట పాడి కాదు. వాని చైదములు మోసములని వేఱు విధములగూడ మనకు దెలియ వలెను.

ఖాత—అది యెంత సేపు మహారాజ్! ఇది యెల్లి అన్నీ యినవస్తాది. మై చెలే గాపుంగా మహారాజ్! (నిష్క్రమించును)

(అంతట సేవకుడు ప్రవేశించును)

సేవకుడు—దేవా! ఖానుసాహేబు వద్దనుండి రాయబారి యొ

కడు వచ్చి ద్వారముకడ మీ దర్శనమునకై వేచియున్నవాడు.

మంత్రి—ఈ రాయబారము జూడ నిదేదో కపటకృత్యము నియే తోచుచున్నది.

జిజా—వత్సా! శివకుమార! నీకీ విషయమున ఖానుడు నిశ్చితార్థమును బోధించుగాత. ఇట్టి సమయమున నే నిచట నుండుట పాడికాదు. గనుక నే నేగెదను. ఆ రాయబార మందలి దూరార్థమును గ్రహించి సమయానుకూలముగ వర్తింపుము. (అని నిష్క్రమించును)

శివా—మంత్రివర్యా! సాధ్య మయినంతవఱకు నతి వినయమును గన్పఱచి యితని ముఖమునుండియే ఖానుని యభిప్రాయమును గ్రహింప వలెను.

మంత్రి—దేవా! అదియే కర్తవ్యము.

శివా—ఓరీ సేవకా! వేగ నాతని ప్రవేశపెట్టుము.

చారు—చిత్తము. (నిష్క్రమించి రాయబారితో ప్రవేశించును)

శివా—(లేచి) అయ్యా! ఈ యుచితాసనమున నధిష్టింపుము.

గోపీనాథుడు—చిత్తము. మీ కెల్లరకు క్షేమమే కదా?

శివా—తమ యనుగ్రహము వలన మీ రాకయు మాకు శుభ మగునని తోచెడును.

గోపీ—శుభప్రాప్తి విషయమై అన్యోన్యము నట్లే యగుగాత. నేను బీజపుర నవాబుల సరదారుడను. వారి కోటల ననేకము మీరు స్వాధీనము చేసికొని రాజ్యమెల్ల యాక్రమించుకొంటచే నవాబు మీ మీదకు నఫ్జులఖానను మంత్రిని యుద్ధమునకు బంపినవాడు. అందుపై

ఖానుసాహేబుగారు మీతో గొన్ని మాటల జెప్పుమనిన నే వచ్చితిని

శివా—తొలుదొల్త సామోపాయ ముపయోగించుటచే నప్జ లఖాను సాహేబుగారి సరసత వెల్లడి యగుచున్నది. యోగ్యుల కది యుచితమే కదా! వారి యాదేశ మెట్టిదో యానతీయుడు.

గోపీ—వినుడు. "చిరకాలమునుండి నీ తండ్రి మాకు బరమ మిత్రుడగుటచే నీ యెడల మేమును మిత్రభావమునే జూపుచున్నా ము గాని వైరభావమును జూపుట లేదు. నీ కనుకూలముగా సుల్తాను గారితో చెప్పి నీ విదివరకు గెలిచిన ఖిల్లాలను నీకు జాగీరుల నిప్పించెద ను," అని ఖానుసాహేబుగారు సెలవిచ్చినారు.

శివా—(స్వగతం) ఇందు కపటమే లేకున్న నర్థములేని యీ వాక్యములు రాయబారమున జన్మించకయే యుండును. ఇక సందియ మేల. (ప్రకాశము) అయ్యా! ఖానుసాహేబుగారు మా మీద దయ నే చూపునుగాని వైరమును జూపడని మాకు దెలియును. వారు సెల విచ్చినటుల మాకు జాగీరుల నిచ్చిన యెడల నవాబుగారి యాజ్ఞానుసార ము వర్తించుటకు మా కభ్యంతరను లేదు. మేము తొలుతనుండియు వారి సామంతులము గనుక నే రాజద్రోహులైన యనేక పాలిగాండ్ర రాజ్యములను నవాబుగారికై సంపాదించినాము. దాని నంతయు నవా బున కివ్వగలము.

గోపీ—అటులైన వృథా వైర మేల! మీ యుద్దేశము ఖాను సాహేబుగారి కెఱింగించుటకు నేను పోయెదను. సెల వొసంగుడు.

శివా—అటులే యెఱింగింప వచ్చును కాని యే తత్కారణం బున మాకు బంధు దర్శన మైనందులకు సంతసించుచున్నాడను. కొంతవర కిచ్చట స్నేహగోష్ఠితో నుండుటకు గోరుచున్నాడను.

గోపీ—అసాధారణ మేధావంతులైన మీ యాజ్ఞను శిరసావహింపకుందునా !

శివా—అది మా యెడల దయ జూపుచున్నారని భావించెదను కాని తమ రే వంశజులో తెలుప గోరెదను.

గోపీ—నేను హిందువును. బ్రాహ్మణుడను.

శివా—అయ్యా ! కేవల వైర సందేశమునే ప్రధానముగా జేసికొని బ్రాహ్మణులకు జేయవలసిన సపర్యలను జరుపక పోయినందులకు నన్ను క్షమింతురుగాక. నా నమస్కారము గ్రహించుడు. (అని నమస్కరించును)

గోపీ—శివరాయ ! మీకు శుభమగు గాత. ప్రస్తుతపు నా వృత్తి కహర్హమైనటుల తాము ప్రవర్తించితిరి. ఇందు క్షమింప వలసిన దేమున్నది !.

శివా—అయ్యా ! అటుల కాదు. నా రెట్టి సేవకవృత్తి యవలంబించినను బ్రాహ్మణులు మాకు దేవతలు, విప్రులను, గోవులను దేశధర్మమును రక్షించి మహారాష్ట్ర స్వధర్మమును ప్రతిష్ఠించుటకు గంకణము గట్టుకొన్న దేశసేవకులము గాన మాకు మీరు వందనీయులు. మేము శుభ మందుటకును మీ దయయే కారణము.

గోపీ—చిత్తము. అది మీ సౌజన్యమున కలంకారముకదా ! (తల వంచి తనలో) ఇంతకు మిక్కిలి మాట్లాడుటకు నే నహుర్డను కాను.

శివా—అయ్యా ! ఖానుసాహేబుగా రిట్లు సందేశ మంపుటచే వారి హృదయము కౌటిల్యము కలది కాదని తలంచెదను.

గోపీ—ఆ ! కాకపో వచ్చును.

శివా—(తనలో) ఈ మాటయందలి స్వరము చూడగా నాతని హృదయము కపటమయమనియె తోచుచున్నది. అయిన నడిగెదను. (ప్రకాశముగా) అయ్యా! బ్రాహ్మణులు వాస్తవదృక్కులగుటచే కేవలము విరోధుల కైనను విప్రభాషణములు విశ్వసనీయములు.

గోపీ—అదియు నెదుటివారి సత్స్వభావముల ననుసరించియే యుండును.

శివా—అయ్యా! మా ముఖ్యోద్దేశము తమకు విన నర్హులు కనుక నించుక చెప్పెద నాలింపుడు. యవనుల బారిబడి చావకుండ బ్రాహ్మణులను గోవులను సంరక్షణ జేయుటయు హిందూ ధర్మమునకు బ్రాప్తమైన దుర్దశను దొలంగించుటకును మహారాష్ట్ర రాజ్యమును స్థాపించుటకును మా ముఖ్యోద్దేశములు గనుక మీరును మహారాష్ట్ర పుత్రులును బ్రాహ్మణులును గనుక నీ సత్కార్యమునకు మీరును దోడ్పడ వలయునని కోరుచున్నాడను. ఇది ధర్మకార్యము. ఇందులకై వావరేయను గ్రామమును మీకు వంశ పరంపరగా జాగీ కివ్వగలము.

గోపీ—(తనలో) ఈ మాటల వినిన తోడనే నాకేమియు దోచకున్నయది. దూర మాలోచించగా నిది ధర్మకార్య మగుట నిశ్చయము. భారత యుద్ధమున గౌరవులయెడ నధర్మ మగుట చేతనే కదా తమ ప్రాణములు పోవు మార్గము సైతము ధర్మాత్ములైన పాండవులకు భీష్మాదు లెఱింగించిన వారు! ఈ యుద్యోగ మూడినను సరే నా చేతనైన మాట సాయము చేయుమని నా యంతరాత్మకు దోచుచున్నది. నేను నిజమునకు నవాబు పక్ష మవలంబించ వలసిన విధియయ్యును నా హృదయ మీ శివాజీ భాషణములపై విశ్వాసము

నభిలషించు చున్నది. (ప్రకాశముగా) అయ్యా! మీ యుద్యమమున కు దోడ్పడు నంతటి సమర్థుండను కాను. అయినను మీ యుద్దేశ మేమో చెప్పుడు.

శివా—మీ యెడ సమర్థత లేకపోలేదు. వివేకులు స్వోత్కర్షను వెల్లడించు కొనరు కదా! చెప్పెద వినుండు. చిరపరిచితు డగుటచే నఫ్జుల్ఖాన్ హృదయము సత్యవాదులగు మీకు దెలియక పోదు. దానినే నే విన గోరు చున్నాను.

గోపీ—ఆ ఖానుని హృదయమును మీ రెట్లుగా శంకించు చున్నారో అటులే యగును. సత్వసమున్నతమైన మీ యంతఃకరణ ప్రవృత్తి యెట్లు సత్యమును గ్రహింపకుండును.

శివా—నేను వానిని మోసకానిగా నెంచు చున్నాను. మీ యుద్దేశ మేమి?

గోపీ—నేనును వచించిన పునరుక్తి కాని వేఱుకాదు, నా యెఱిగినంత చెప్పెద వినుడు. అఫ్జుల్ఖాన్ మహా దుర్మార్గుడు. సమయోచితమైన బుద్ధి వైభవంబున దనతో సమానులు లేరని బహుగర్వము కలవాడు, తీయని మాటలు జెప్పి నమ్మించి ద్రోహము సేయుట కంతవాడిక లేడు. కావున నట్టివానిని కుటమార్గము చేతనే సాధింప వలె కాని న్యాయమార్గంబున జిక్కడు.

శివా—మహాత్మా! ఇప్పటికైన తమకీ యభిమానము వొడమి నందులకు వందేహమని మొక్కు చున్న వాడ.

గోపీ—అయ్యా! నే నెటులైన నాతని మీ కోటకిందకు దోడ్కొని వచ్చెదను. మీరును నచటికి వచ్చి మాట్లాడ వచ్చును. అతడసాధారణ ప్రజ్ఞ కలవాడు. మీ రపుడు బహు జాగరూకత

తో మెలంగ వలెను. నే నిచట దడవు మసలరాదు. పోయెదను.

శివా—అయ్యా! భవాని మిమ్ముల సర్వవిధముల రక్షించు గాక. ఈ భారము మీయది కాని నాదికాదు.

గోపీ—నేను నా చేత నైనంత వరకు లోపము చేయను కదా! సెలవు దయ సేయుడు.

శివా—చిత్తము. ఈ కార్యానంతరమునుండి వావ చేయను గ్రామము మీ యధీనము కదా!

గోపీ—చిత్తము. (నిష్క్రమించును)

శివా—మంత్రిశేఖరా! అఫ్జలఖానుని వధించుటకు మఱియొక యుపాయము జిక్కినది. మన కోటకు సమీపమున గొప్ప చెట్లను నరికించి యచట చక్కని మంటపమునొక దానిని నిర్మించు నట్లు జేయించుము. అచట కాతనిని రప్పించి కార్యమును నెఱవేర్చు కొందము. మఱియు మా తల్లిగారిని వత్సయైన శంభాజీని పిలుపింపుము.

మంత్రి—చిత్తము. సేవకా! వారిని దోడ్కొని రమ్ము.

సేవకుడు—శిరసావహించు చున్నాను. (నిష్క్రమించి జిజా శంభాజీలతో ప్రవేశించును.)

శివా—(తల్లికి నమస్కరించి) అమ్మా! మే మిపుడు సమర ద్యూతమునందు ప్రవేశించు చున్నాము. జయాపజయంబులు భగవదధీనంబులు. న న్నప్జుల్ ఖానే చంపునో వాని నేనే సంహారించెదనో తెలియదు. దైవవిధి తప్పి వానివలన నే నే చంపబడిన యెడల మిగుల నపాయము సంభవించును. కావున నీ వెట్లు తురుష్కుల బారి పడకుండ దాటెదవో! తల్లీ! బహు భద్రము. ఎప్పు డీ మహాత్కార్యమును నేను మీాద వైచి కొంటినో యప్పుడే నేను చచ్చితినని త

లంపుము. నేను నీకు బుత్రుడను కాను. దేశమునకు బుత్రుడను కావున విచారింపకుము.

జిజా—వత్సా! అమంగళము ప్రతిహత మగుగాత! లోక రక్షణమునకు గంకణము కట్టుకొన్న నీకు దప్పక జయమగును గాత!

శివా.—ఓ మంత్రిశేఖరా! నే నప్జలి ఖానుని గలయుటకు బోయిన సమయమున బహు జాగరూకతతో సాంకేతిక స్థలముల యందుండవలెను. సమయము కలిగిన వెంటనే శార్జగవము చేయబడును. తక్షణమే మీ రెల్లరు దలపడి యవన సైనికుల నామావశిష్టులగా జేయుడు. మఱియు నో సచివాగ్రణీ! (బాలకు నెత్తుకొని)

ఉ. కాలము మారి దుష్టుడగు ♦ ఖానుని చేతికి నేనె చిక్కినన్
దూలగ బోక శత్రువుల ♦ దుంపుడు నా జనయిత్రి నీమె నీ
బాలకు దల్లిలేని పసి ♦ వాని మరాటుల రాజ్యనేత నే
లీలను బ్రోచువారలో ఖ ♦ లీనుల కండ్లకు దోపకుండగన్.

మంత్రి—దేవా! ఏమి యీ వెఱ్ఱి. అందరిని బ్రోచు భారము మీయదే! మిమ్ములనే జయలక్ష్మి వరించును. లేకున్న యత్నో ధర్మ స్తతో జయమను నార్యోక్తి మృషయగుఁ గదా!

శివా—అయ్యా! రెండు సంవత్సరములు నిండకమున్నె యీ కుమారుని తల్లి వీని బోషించు భారము నా మీద వెట్టి యామె స్వర్గయాత్రకు వోయెను కదా. అంతటనుండియు వీనియందు నా కధిక ప్రేమ యుండుట సహజము. అధిక ప్రేమ అపాయమును శంకించునుకదా!

జీజా—వత్సా! ఇట్టి సమయమున నా వృత్తాంతము దల పకుము.

శివా—తల్లీ! ఈ కుమారుని గై కొనుము. మంత్రీ! నేను చెప్పినటుల సమర సన్నాహమున నుండ మన సైనికులకు నియోగింపుము. నేను భవానీపూజ కేగెదను.

మంత్రి—చిత్తము. (అందరు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.





# మహారాష్ట్ర విజయము.

## పంచమాంకము.

(రుస్తుంఖాన్ సాహేబు ప్రవేశించును)

రుస్తుం—మన్మ ఒకటి తల్సితే అల్లా యింకొకటి తల్సుతాడు షివాజీకి దోస్తీమాట సెప్పి సమీపానిక్కి పిల్సి మిస్మిల్లా కరణేను మాంది అఫ్జల్ ఖాన్ సాహెబ్ ఆలోచన షేస్తే అంతకంటే ముందు షివాజీ ఖాన్ సాహెబ్ కా పోట్టసించి మరగయా సేసినాడు. అరరే! ఖోండయలక యెంతపని సేసింది. మాద ఖాన్ సాహెబ్ మాయాకీ మగడు అయితే యీడు మాయా మగడికి మగడు అయినాడ్. మై యేమి సేయావాల. (యెదుటజూచి) ఓ, అద్మి. యిదర్ ఆయా హై కోన్ హై క్యా! యిది షివాజీకా జబాన్ హైతో మేరేకు ప్రాణానికి మోషం వస్తాది. (నిదానించి) నై నై. ఓ అల్లీఖాన్. ఆ యా హై అచ్ఛా.

అల్లీఖాన్—(ప్రవేశించి) క్యారే భాయి. రుస్తుంఖాన్! అక్కడ లడాయి జరుగు తుంతే యిక్డ యేమ్టి సూస్తుండావురే

రుస్తుం—అరేభాయి సలామ్. లడాయిమాట సెప్తే హామారా ప్రాణం చడాయిస్తాది. మై సచ్చిపోతే పిల్లల్కి ప్యారీకి దిక్కు నై గన్క మై అక్కడ అక్కడ తిరిగి షివాజీకా సంగతీ మోసోనికి యెల్లి సవాబ్కి యినిపిచ్చావాల. అందుకు యిది తయార్ అయింది.

అల్లీ—(తనలో) ఇది కూడా లడాయికా పికిర్ తగిలి నిద్రలేక చడాయించినామ్. మాకీ దోస్తీ అచ్ఛాగా దొరికింది. (ప్రకాశముగా) క్యారే భాయి! శివాజీ రాంగణా దుర్గానికి చేరనీకులేవు!

రుస్తుం—ఓ అచ్ఛాగా జేరతాది. ఆడు మనిసి బలం యెక్వా వుంటే తురుకుమంతార్. తక్వావుంటె తరగమడతార్. అన్ని కొండల్ ఆడే వుంటాడ్.

అల్లీ—అరేభాయి! లచ్చసెప్పు కోటిసెప్పు. యిద సమయం లో మిస్మిల్లా సేసి తీరతార్. యేమి అంటే ఒకసోట జింజీరాసిద్ది తగులు కొన్నాడు. ఒకసోట సావంతు తగులు కొన్నాడు. ఒకసోట అఫ్జుల్ ఖాన్ బిడ్డ అహమదిఖాన్ లడాయికి సిద్ధమైనాడ్. యిది దెబ్బతో ఖాండాయెల్కా గిండాయెల్కా గుండా ఖావాల. యిది తురుకుపిండాల్ ఛోడ్తా హై క్యా!

రుస్తుం—అరే! నీకీ యేమ్టి తెల్సు. వాడు బడా ధైర్యశాలి. ఒకసోట రఘునాథ్ భల్లాల్ యింకొకసోట బాజీఫసల్ కర్ యింకొకసోట అబాజీసోనదేవు యింకొకసోట మోరోపంతు పింగళేను కడాకతా చేసినాడు.

అల్లీ—జానాదేవ్! మాకీ క్యాబిచార్. శివాజీ రాంగణాకోటాకీ జేరిందిలేదు. నీకీ యేమ్టితెల్సు.

రుస్తుం—అబిపాంచ ఫిరంగీల్ యేసినీకిలేవు. అదీవాడు దుర్గానిక్కి చేరిన ఆనవాల్ పెట్టినార్. అయితే అక్కడ లడాయిమే యేమి జరుగుతుండాది మాకి సెప్పువో భాయి.

అల్లీ—అక్కడ శివాజీకా సేనాధార్ బాజీపర్భూ రెండు కొండల్ సందు కాశీనాడు, పహడ్ కా వుపర్ కి యెక్కపోతె గుండు

దెబ్బల్ వేసుతుండార్. జోరిగల్యాలె అలుగుల్ వచ్చి ప్రాణాల్ తీసుతుండార్. మై క్యాకహనా. బహుత్ లడాయి హోతీహై. బీజాపూరునుంచి రెండుసార్లు సేనవచ్చి బాజీ కుతిపించు అగ్గిలోమగ్గిపోయినార్ మూడోసారి వస్తుంది అని సెప్పుసుండార్.

(తెరలో)

మ. ప్రళయాంభోధర నిర్గళాశని గణ ♦ ధ్వానోపమంబై మహా
బలసంఘాత తరంగ సంచలిత ఘుం ♦ భద్వార్ధిక భీష్మాత్రవా
వలమై ప్రాపిత రోదసీకుహరమై ♦ ప్రాంచద్విపక్షస్వనా
కులమై సంగర భూమి నేమి కతమో ♦ కోలాహలం బయ్యెడిన్.

అల్లీ—అరే! రుస్తుంఖాన్! యిది యేమ్టివ్రాయి. మాది దిల్ ఫిఠఫిర్లాడ్తాది.

రుస్తుం—అరేభాయి! షివాజీకి రాంగణా దుర్గంమే యిడిసి తండ్రికి షాయం సేయడానికి బాజీపర్భూ బిడ్డ బాలాజీబాజీ లడాయికీ యెల్లుసుండాడ్.

అల్లీ—అరే! యిక్డవుంటే మాకీ దేషాన్కి బలీపెడ్తాడ్. ప్రాణంవుంటే ఫక్కీరై బ్రితుకుతాం. మై వెల్లీపోతాం.

రుస్తుం—మైభి ఆయూవహుం. మాకీకూడా సరికీయొస్తే యేమ్టి సేయూవాల.

(ఇద్దరు నిష్క్రమింతురు)

ప్రవేశకము.

(బాలాజీ బాజీ ప్రవేశించుట)

బాలా—

మ. ప్రళయాంభోధర నిర్గతాశని గణ ♦ ధ్వానోపమంబై మహా
బల సంఘాత తరంగ సంచలిత శుం ♦ భద్వార్ధి ఘీప్కార రవా
వలమై పూరిత రోదసీ కుహరమై పాంచద్విపక్ష స్వనా
కులమై సంగర భూమి నేమి కతమో ♦ కోలాహలం బయ్యెడిన్.

ఈ సింహనాదంబులు యవనులవని తోచెడిని. (ఆలోచించి) ఏమి నా వెఱ్ఱి! కాదు కాదు,

శా. ఆజిప్రౌఢిమ మెంచగా నపర ♦ భీష్మాచార్యుడున్ వైరిరాట్
తేజంబార్పంగ వార్షికాబ్దము విరో ♦ధిస్ఫార శుష్కాటవీ
తేజో రూపుడు భీమ విక్రమమునన్ ♦ దీపించు నా తండ్రియా
బాజీనేత దురంబు సేయ యవనుల్ ♦ ప్రాణమ్ము లాసింతురే!

(ఆలకించి) ఏమిది! ఈ వికృతారవములు మ్లేచ్ఛుల వనియే తోచుచున్నవి. నే నింకను ఆలస్య మెందులకు సేయవలెను. అనేక కంఠ నిర్గత రుధిరాసారంబున నవగాహనం బొనర్చిన యీ ఖడ్గమే సహాయముగ సమరమున నురికెదను. (నడచి) ఏమిది! దేశక్షేమమునకై దేహ మర్పింపనున్న నాకు గూడ నాహవ ప్రయాణమునకు నవశకునములగుచున్నవే! ఇది శ్రేయస్కార్యముకదా! అయిన నేమి! ప్రబలారాతి చమూమహార్ణవ శుష్కీకరణ చణుడనగు నన్ను గూడ నీ దుర్నిమిత్తంబు లాగ గలవా!

గీ. కడలిపై బడు చెలియలి ♦ కట్టవలెను

యవన వాహిని నా తండ్రి ♦ యధిగమింప
దుర్మిత్రంబులకు మది ♦ దొట్రు పడుచు
నూఱకుండ నగునె యూ? ♦ నుఱకకుండ.

కావున నే నిప్పుడే పోయి మా బలములయొక్కయే పరాజయ లేశంబు ననో పెచ్చుపెఱగిన మ్లేచ్ఛుల సింహనాదంబు లడంచి నై చెదను. (నడచి) ఆహా! ఏమిది! ఒక వామ నయనమే కాక వామ భుజము సైత మదరుచున్నదే! ఛీ! ఓదుర్నిమిత్త పిశాచములార! మిమ్మునే నరకు సేసెడు వాడ కాను.

ఆ. వె. దేశ ధర్మములకు ♦ దేహ మర్పించిన
యన్న శకున మెట్లు ♦ నవయ జేయు
జలధి జచ్చు వాడు ♦ జల్లకు జంకునె
శకునములకు నులుక ♦ ఛాంద సుడనె.

నే నిక నాలస్యము సేయరాదు. పోయెదనుగాక. (నడచి చూచి) ఔరౌర! ఏమిది! మా బలములు తురుష్కసేనా ప్రయుక్త నాళికా గోళికా హతదేహులై సిగ్గువిడచి పారుచున్నారే! ఓరోరి మహారాష్ట్ర సైనికులార! అభిమానులార!

చ. నిలునిలు డార్యులార! తగు ♦ నే రణభూమిని వీడి పాఱగా
బలుచఁ దనంబు కాదె పెఱ ♦ వారలు చూచిన నవ్వకుందురే
కలగుచు మూలడాగినను ♦ కాయము పోవక యుండు నొక్కొ ని
ష్ఫలముగఁ జచ్చుకంటె నని ♦ జచ్చుట స్వర్గము జొచ్చుటే సుడీ

సీ! ఈ తుచ్ఛమూర్తులైన పా[illegible] కాసించి యవన వాహినీ బాధలకు తాళజాలక పిఱికి పందలై మా సైనికు లెట్లు పరుగిడు చున్నవారలో! హా!ం.

ఓ కోరి యనివేశులార !

గీ. దేశమాతకు భక్తితో • దేహమర్ప
ణంబు జేసిన జేయకు • న్ననుగతింప
కుండ దీమెను క్షణికమై • యుండు కతన
మీరు నవ్యక్త మొక్కడే • మిగులు గాని.

ఓ పారుబోతులార !

గీ. పౌరుషము లేదె నిజముగ • భరత మాత
సూనులరు కారె శౌర్యాబ్ధి • మానములను
గంగ గలిపితిరే సిగ్గు • కాదె మీకు
టంబు నల్పాన తింప నిం • ద్యంబుకాదె.

ఇదియేనా మీ దేశభక్తి స్వార్థత్యాగము.

ఓరోరి యవివేక వాక్యాదులార ! మీరు శత్రువులకు వెఱచి పాఱుచున్నారు కాని మృత్యువునకు భీతిల్లి పరుగిడ లేరు సుడీ ! ఏల మీకీ వెఱ్ఱి ! ఈశ్వర కార్యమును నిర్వర్తింపుడు.

మ. అరిగాఢ్కాంతవిఘాంతనా చరణద • ర్పాధ్యక్షుఁడౌ వీరకే
సరియౌ నా జనకుం డమోఘముగ నీ • సంగ్రామ భారంబుఁ దా
భరియింపంగ భవన్మనంబుల భయా • త్పాతంబదేలా యిటుల్
పరుగుల్ వారఁగ నేల నిందలకు • బాల్గానేల మహాత్ములై.

అరరే ! నా మాటల నెంతమాత్రము వినిపించుకొనక సిగ్గువిడచి యెట్లు పలాయను లగుచున్నారో? సమరమహాధురీణుఁడైన మా తండ్రిగారిచే పరిపాలింపఁబడుచుండియు నీ సైన్యమున కీదృశావస్థ తటస్థించుట కేమి హేతువో?

(తెరలో) మీ తండ్రిగారే కారణము.

ఏమిది! మహారాష్ట్ర సేనా సంక్షోభమునకు గారణము మా తండ్రి గారా! ఓరోరి మిథ్యావాదులార! ఓరోరి వాచాటులార!

చ. అనలము వేడిబాసెనె మ । హాంబుధులింకెనె పశ్చిమాశ యం
దిను డుదయించెనే సుర మ । హీధ్రము వ్రిస్సెనె లేక యున్న నా
జనకు డదేల ఛత్రపతి । సైన్యము దైన్యము నొందఁ గతఁ డయా
చెనటి దురుక్తులాడెదవె । చీల్చెద జూడుము నీదు నాలుకన్.

(మరల దెరలో)

గీ. దేనియం దద్వితీయ భ । క్తి యనురాగ
ములును ప్రేమయు గౌరవ । ములు వెలయునో
యది విధివశమునను నష్ట । మైన యప్రుడు
దుఃఖ మొదవక మోదంబు । దొడరునయ్య.

ఔరా! ఏమిది! నా తండ్రిగారికె నష్టము సంభవిల్లెనా! నేను నమ్మ జాల. ఏలయన,

గీ. దైవ సంకల్పము దబ్బిబ్బుగా శేయ
జాలు బల్లిదుండు । శౌర్య రాశి
నాగు తండ్రి కేడ । యూదైన వికృతుల
వేడ కల్ల నమ్మ । వాడ నొక్కొ.

ఓరోరి క్షుద్రులార! పాండురంగ భక్తుడును అసమాన బాహుపరాక్రమ శాలియు నైన నా తండ్రిగారి కట్టి వికృతి కల్గనేఱదు. ఏల నన్ను బెదరించెదరు. యవన మాయలను నే నమ్మెద నను కొంటిరా యేమి?

(పాండురంగదత్తు ప్రవేశించి)

పాండు—వత్సా ! ఎందుల కీ వెఱ్ఱి ! యుక్కునకు జెదలు పట్టి నపోయి తండ్రి !

బాలా—(చూచి) ఆ ! ఏమిది ! మా తండ్రిగారి చక్రరక్షకు లగు పాండురంగదత్తు గారేనా ! అయ్యో ! ఏమిది ? సన్నా అన లములేక మాటచేతనే దహించు చున్నారే !

పాండు—నాయనా ! అగ్గికంబమును తుట్టపురుగులు దొలచిన పోయి. ఏమి చెప్పుదును తండ్రీ !

బాలా—హా సుతవత్సలా ! హా సుగుణప్రదీపక ! హా దేశ భక్తాగ్రేసరా ! హా స్వార్థత్యాగీ ! హా వీరకేసరీ ! హా తండ్రీ ! (మూర్ఛ పోవును)

పాండు—కుమార ! ఆ మహాత్మునికై విచారింపం బనిలేదు. ఏను నిమిత్తమై జన్మించెనో అట్టి దేశోద్ధారణకై వీరశయన మందిన వాడు. అతడు కేవల బాహ్యదృష్టుల కగోచరుడు కాని మనోదృక్కు లకు సర్వదా పొడసూపు మృతజీవి.

బాలా—ఆర్యా ! మహాత్మా !

చ. పరివిమల భక్తియుక్తుడును ♦ భారతసింహము నామతండ్రి యూ
శివపతి కోట చేరెనని ♦ చేసిన యట్టి ఫిరంగి శబ్దముల్
చెవినిడుకొన్న పిమ్మటను ♦ జీవము వీడెనో లేక ముందె యీ
భువి నెడబాసెనో వివర ♦ మున్ వచియింపవె భూసురాగ్రణీ !

పాండు—(స్వగతం) ఆహాహా ! పితృశోకానలమున మునింగి యు నిత డడుగవలసిన దానిని ముందడుగు చున్నాడు. ఇట్టి వారలే కదా నిజమైన సన్మార్గ వర్తకులు. (ప్రకాశముగా) వత్సా ! నీ

తండ్రిగారి పరాక్రమ మెఱింగియు నిట్టి నిర్లజ్జపుమాట లాడెదవేల ? స్వామి కార్యమును నిర్వహింపకుండ నీ తండ్రియేనాఁ ప్రాణముల విడచు వాఁడు !

బాలా—హా ! గురుకార్యాచరణదక్షా ! హా ! పరతంత్ర విచ్ఛేదనా ! సమరధౌరేయ ద్రోణాచార్య ! హా తండ్రీ !

చ. యవన మహాపకార మహ ◆ దగ్ని దపించెను మాతృభూమికై
ప్రవిమల భక్తి రంజిలఁగ ◆ ప్రాణ సమర్పణమున్ బొనర్చి లో
క విదితమైన కీర్తిఁ గరము ◆ గాంచితె నాకిక నేమి దిక్కు నీ
శివపతి సేవమ్మాని దివి ◆ జేరితివే దయమాలి యక్కటా !

(కొంచెము దుఃఖ మాపుకొని) అయ్యా ! మా తండ్రిగా రేతీరున నస్తమించిరో యానతీయుఁడు.

పాండు—వత్సా ! అపుడా సిద్దిజోహారుని పుత్రుఁడు బహుళ సైన్యములతో మసల వెన్నాడుటఁగాంచి శివాజీ మహారాజుగారు "ఓ బాజీప్రభూ ! నీ విచ్చట నిలచి నేను రాంగణాకోట చేరువరకు నీవీ సిద్దీవానిని నిరోధింపుమని యాజ్ఞ యొసంగుట వింటివికదా ! పిమ్మట మీ తండ్రిగా రతి ధైర్యమున నీ రెండుకొండల నడుమనున్న యిఱుకు త్రోవను గాచి యా ప్రచండములైన తురుష్క సేనలు సమీపించి గుట్టల నెక్కుటకు బ్రయత్నించు సమయమున నిలు నిలుమని యదలించి వివిధ నారాచ పరంపరల బ్రయోగింప నా శరవర్షణమునకు మువ్వంతు సేన నామావశిష్టమయ్యె.

బాలా—సరే ! ఇది సహజమే.

పాండు—తరువాత నో వత్సా ! ఏమి చెప్పుదును. సముద్రము నందు మునుఁగుచున్న వానికి తెప్పకొయ్య చిక్కినట్టుల నుక్కుడక్కి తెల్లమొగములు పై చికొని నిర్వ్యాకపడియున్న నా తురుక దండునక్కు స

హాయముగా విజాపురమునుండి వేఱొక ప్రచండ సైన్యము వచ్చి చేరెను.

బాలా.—అది సహాయమే కాదు. ప్రాణపరిదానమని నే నూహించెదను.

పాండు—వత్సా! కాక మతేమి? ఆ ప్రకారముగా వచ్చిన విజాపుర సైనికులం జూచి సిద్దిజోహారుని సుతుం డిట్లనియె. ఓరోరి యవన వీరులారా! నాటి భారత రణంబున సైంధవుండు పాండవుల నడ్డగించినటుల మనల నేడీ బాజీపరభూ నిరోధించు చున్నాడు. మూడు వందల సైనికులతో మన మూడువేల సైన్యము నెదిరించి యాగుటచేత నీతని యప్రతిహతప్రతాపము వెల్లడి యగుచున్నది. యవన లజ్జాకరమైన యీ మాటవిని నిజమైన యవనుడు జీవింపడని నమ్ముడు. తుచ్ఛములైన ప్రాణముల కాపింపక వేగ దలపడి నీ బాజీని నోడించి శివాజీ రాంగణాకోట చేరకమున్న నాతని చెఱ బట్టుడు. జాలము సేయకుడు వేవేగ మీమీ శక్తులను ప్రదర్శించుడు. రండు రెండు,, అని పికాపికలైన సైనికుల మొగల బురికొల్పి యందరొక్కుమ్మడి బిరంగుల బాఱు చేసి ప్రయోగించిన నొక్కటైన మన బలంబులకు దాక కుంటయేకాక యీ శృంగాటకంబుననుండి మన సైనికులు కురిపించు బాణవర్షము నకు దాళఁజాలక యవన సైనికులు శకలీకృత దేహులై కొందరు చచ్చుటయుఁ గొందరు విచ్చుటయు విలోకించి యీ యవనవీరు డెలుంగెత్తి పిలచినను రాకుండుట గాంచి తానును సమరాంగణంబున కనతి దూరంబున నిలచి యోజించుచున్న సమయంబున రెండవసారి విజాపురమునుండి వచ్చిన సైన్యమును గాంచి హర్షమానస మగ్నుండై యందరుంగలసి సంగ్రామరంగంబున నధిరోహించి యాహవంబున కోహ

టింప నట్టియెడ వెలువడు ఫిరంగిగుండ్లవలన బొడమిన శబ్దంబుల నుఱుములును అన్యోన్య సంఘట్టనంబున జన్యమై ప్రజ్వరిల్లెడు మెఱుములును నాళికలనుండి వెలువడిన ధూమపుంజంబు లనియెడు వారి వాహంబులును శరధారలనియెడి వర్షధారలును జనుల హాహారవంబులనియెడి కోలాహలంబును నొక్కసారి వెడలి యకాల ప్రళయకాలము సంజనితంబయ్యె.

బాలా—బళిబళీ! అట్టి సమయమేకదా దర్శనీయంబు.

పాండు—ఇట్లు మూడవసారి దలపడ విజాపుర సైన్య మధికమగుటయు మన మహారాష్ట్రసైన్య మత్యల్పమగుటచే మువ్వంతుసేన వీరశయన మగుటయు నవలోకించి మీ తండ్రి బాజీపరభూ హతావశిష్టులైనవారి బిలచి ఓరోరి సైనికులార! ప్రభువైన శివాజీ యింకను రాంగణాకోట జేరినట్లు ఫిరంగులు వినరావయ్యె. మ్లేచ్ఛసేన పంచసహస్ర సంఖ్యాకంబనియు మన సేన యొక శతమనియు నెంచి భీతిల్లవలదు. మనము మాత్రము స్వామియాజ్ఞ యనువరకు దుచ్ఛములైన ప్రాణముల కాశింపక పోరుదమని చెప్పి హెచ్చరింప బెండ్లిపీట నధిష్ఠింప బోవు సంతోషమురీతి నంద రధిక సాహస సంభ్రమములనా జన్యరంగస్థల మధివసించి యూజికి దలపడిరి.

బాలా—మా తండ్రిగారి స్వామిభక్తి మా వంశమునకు నా సైనికుల సాహస శౌర్యములు దేశపుత్రుల కెల్లరకు భూషణములైనవి. తరువాత!

పాండు—తరువాత నో వత్సా! (దీనత్వముతో) ఏమి చెప్పుదును. యవనవాహినినుండి యొక్క ఫిరంగిగుండు బగ్గుబగ్గున మండు చు శౌర్యరాశియైన మీ తండ్రిగారి హృదయంబుం జించుకుపోవ అ

న్నా ! స్వామికార్యము నెరవేర్పకమున్న జచ్చుచుంటినేయని రోషము న నుత్తరీయమును హృదయబిలమునందు కూరి ఖడ్గము వెఱికి విసరి వేయ నా ఖడ్గప్రహారంబున దెగిపడు వైరి శిరముల చప్పుడులును శివ కుమారుడు సురక్షితముగ రాంగణాకోట జేరినటుల కాల్చఁబడిన అయిదు పిరంగులయొక్క ధ్వనులు నొక్కసారి చెవిని బడ యానందించి నా కింక జచ్చెదనన్న విచారము లేశమైనను లేదని నన్ను బిలచి, ఓయి ! నా కుమారుడైన బాలాజీతో నా మాటలగా చెప్పుము ‘‘వత్సా ! ఆయుష్మంత ! నీవు నా కొరకై చింతింపకుము. భౌతికమైన కాయము నశ్వరము ఏ యుత్కృష్టమైన యీశ్వరకార్యమును నిర్వర్తించుటకు బొడమితినో అట్టి యీశ్వరోద్దిష్టమైన కార్యమును జేసి పాపభూయిష్టమైన జన్మదుఃఖము నవలద్రోసి శాశ్వతంబైన యపవర్గ సౌఖ్యము నందబోవు చున్నాడను మనకార్యములు శాశ్వతములుకాని మనము శాశ్వతులము కాము. కావున జనకాది బంధుప్రేమా బంధములను బటాపంచలు చేయుము. తుచ్ఛములైన ప్రాపంచిక సౌఖ్యములకును బ్రాణములకు నాశించి యీశ్వర కార్యమునందు ప్రమత్తుడవై సంచరింపకుము. దేహమున బ్రాణము లున్నంతవరకు రాజభక్తిని విడువకుము. దేశీయదాస్యమే నీ కీర్తి ప్రతిష్ఠాపనకు మూలము. దేశద్రోహ సంహారమే నీ జీవయాత్రయందలి తత్వము. అదియే నీపదము నీ మోక్షము. మరువకుము.-ఇదిగో నేను విమానము నధిష్ఠించి వీరస్వర్గమునకు బోవుచున్నా,, నని చెప్పి యతిశయించిన యా వేదనచే నిలువలేక కనులు మూసికొని యట్టె భూమిపయింబడి మహామాతను జపించుచు గీర్తిశేషు డయ్యెను.

బాలా—

గీ. నన్ను గన్న తండ్రి ! , నాయనా ! ఇది కష

సారి బోధయే వ్రశస్తచరిత
నీవులేని వెలితి నే విధంబునఁ దీరు
నాకు భారతీయ లోకమునకు.

చ. కొడుకు విరోధ మార్గమునకున్ జనునంచు భయంబు జెంది యి
ష్వడువున బోధ జేసితివె భారతపుత్ర! భవత్సుతుండనై
పొడమిననాకు నొక్క గుణమున్ జనియింపదె నీ ప్రబోధముల్
పెడతల ద్రోసి నానె పులి పిల్ల కొకండును చార కల్గదే.

పాండు—వత్సా! బాలాజీ! బీజ మొకటినాటిన మొలక మ
రొక్కటి జనించునా! నీవును నీ తండ్రిగారి కీర్తిలతికనే దిగంతముల
వరకు బ్రాకఁ జేసెదవు.

బాలా—అయ్యా! అట్టివాడనైన బిమ్మట గదా నేను ధన్యు
డ నగుట. ఆ మహాత్ముని యస్తమాన వార్త నాకు మరపు రాకయు
న్నది. హా తండ్రీ! హా కీర్తిపురుషా!

సీ. శివకుమారునకు రెండవ భుజంబై యుద్ధ
ములనింక నెవరు వర్తిలుదు రయ్య
దేశాభిమానంబు దీపించు నట్టి భ
క్తిని సేన కెవరు బోధింతురయ్య
దేశీయదాస్యంబు తెగ్రింపఁ జాలిన మాతృ
సేవ నింకెవ్వరు సేతురయ్య
అఖిల జనంబుల యందు సూహృద్బుద్ధి
మెలగి యింకెవరు ప్రేమింతురయ్య
గీ. స్వామి కార్యార్థమై తృణ ప్రాయముగను
ప్రాణముల విడ నాడితే భవ్యపురుష

నిశ్చలంబైన భక్తిచే ♦ నెగడువాఁడ
కటకటా! యెట్టులోర్తు నన్ ♦ గన్నవాఁడ.

పాండు—వత్సా! ఏమి నీకీవెఱ్ఱి. దేశార్థమై భక్తి పురస్సరమైన తన ప్రాణపంచకమును సమర్పించుచున్నందులకు మిగుల యానందించుచున్నాఁడనని చెప్పిన యీ మహామహునికై విచారించుట నీతండ్రి స్వర్గయాత్రకు నిరోధము సుమీ!

బాలా—అయ్యా!

గీ. ఈ పితృవియోగ శోకాగ్ని ♦ నాపుకొన్న
గాని మేనును దహియింపఁ ♦ గడఁగె నకట
జ్ఞానమెల్లను పంచ బం ♦ గాళమయ్యె
గాన నేనును తండ్రి మా ♦ ర్గమున బోదు.

పాండు—ఇసీ! ఎంతమాట పలికితివి నాయనా!

గీ. తండ్రికై చత్తు ననెదీవు ♦ ధర్మమగునె
పౌరుషమెయున్న నీ యరి ♦ ప్రకరములను
జంపి దేశమునకు మేలు ♦ సలిపి కలన
జచ్చుటయె నీదు జన్మంబు ♦ సార్థకంబు.

బాలా—అయ్యా! అటులైన నే నిదే ప్రాణముల దేశమునకై ధారవోయుచున్నాను. (అని లేవ బోవును)

పాండు—ఆగు మాగుము.

గీ. చంచలం బల్ప మగు ప్రాణ ♦ పంచకంబు
విడువ నది నీ యధీనమై ♦ వెలయ లేదు
సత్యమైనట్టి భక్తి ని ♦ శ్చలన మతిని
నాత్మధర్మార్థ మర్పింపు మాశ విడచి.

బాలా—మహాత్మా! నిశ్చయముగ సెలవిచ్చితిరి. నివురుప్రావ నూదఁబడియు నగ్నికణము స్వభావముగుటచే దిరిగి నివురు గప్పురీతి జ్ఞానోపదేశంబున నిర్మలమయ్యును నా యంతరాత్మ మరల మోహాకబళిత మగుచున్నది. ఇదే నేను దృఢమైన భక్తిపూర్వకముగ నమస్కారమును విడచి యాత్మధర్మమునకై యే చచ్చి పోయెదను. అయ్యా! మా తండ్రిగారి కగ్ని సంస్కారము చేయుటకైన యవకాశము కలదా!

పాండు—వత్సా! లేకేమి? మీ తండ్రిగారి శవమును శత్రువుల చేత జిక్కకుండ మన భటులొక పర్వతగుహలో డాచి యుంచినవారు కాన వారి కగ్ని సంస్కార మొనరించి పిమ్మట శివాజీమహారాజుగారిచే సైన్యాధిపత్యమున కభిషిక్తుండవై ద్రోహము నణచి శత్రువుల బరిమార్చి పితృవధామర్షణంబున మలమల మఱుంగుచున్న నీ హృదయ సంతాపమును జల్లార్చుకొనుము.

బాలా—అయ్యా! చక్కని మార్గము నుపదేశించితిరి. నడువుడు పోవుదము. (నిష్క్రమింతురు)

ఇది షష్ఠమాంకము.



శ్రీ

# మహారాష్ట్ర విజయము.

## షష్ఠాంకము.

రంగము—చాకణ్ దుర్గసమీపారణ్యము.

రుస్తుంఖాన్ ప్రవేశము,

రుస్తు—హమారా బీజపూర్ సుల్తాన్ మాకీ బులావ్ సేసి క్యారే రుస్తుంఖాన్ సబ్ మహారాష్ట్ర దేషంమే తిరిగి షివాజీకా లడాయి ఖబురు తెల్సిరా అని మాకీ ఆజ్ఞ యిచ్చినాడు. ఇది పహాడ్ కీ పహాడ్ కీ అడవి అడవి దేషం దేషం తిరిగి తిరిగి వచ్చీనాది. ముఝెకుచ్ మాలుం నహి. ఆడీకి యిసుగుఘెట్టి మునుగు యేస్కాని షుకంగా అంతఃపురమ్మే బేహద్బీగా వుండాడు. మాదీ కష్టం గట్టాకీ యెక్కినాది మై బిజాపూర్కా సేలేగావుంగా.

(అంతట కాలేషా అను మొగలాయి ప్రవేశించును)

కాలే—షివాజీ షివాజీ అని దేషాలన్నీ రొజాసేస్తాయి కాని మాకీ మాత్రం సూపూ.లేదు. మేరా ఢిల్లీషాదుషహా ఔరంగజేబు షివాజీకాపేరు సెప్తే ఒళ్లు మండి కొండయల్కాను బట్టి గుండ సేసితా అని మాది శావాస్తే ఖాన్సాహేబుకా ఆజ్ఞా యిచ్చీనాడు. అందుకు మై తయార్ అయినామ్. (ముందు చూచి) ఓ సాహేబ్!

ఆ యీా హై కోన్ హై క్యా. (సమీాపించి) ఓ సాహేబుజీ సలాం.

రుస్తుం—సలాం భాయి. ఆప్ కోన్ హై.

కాలే—మై ఢిల్లీపాదుషహా ఔరంగజేబ్ కా సేవక్ హుం ఏక్ కార్యాంతర్మే చాకణ్ దుగాౕన్కి సేలేగావుంగా. ఆప్ కోన్ హై జీ!

రుస్తుం—మై విజాపూర్ సుల్తాన్కా దూతాహుం. మై నివాస్కు జాతాహుం.

కాలే—భాయి! మాదీ ఒకటి మనవి వుంది. ఆప్కా సుల్తాన్కా షివాజీకా షంధి జరిగిందీ క్యా!

రుస్తుం—అచ్ఛా. షివాజీకాతండ్రి శహాజీవచ్చి కొడుక్కు మంచి సెప్పి షంధీ సేసీనాడు. షివాజీకూడా హామారా సుల్తాన్కు ఖొన్ని ఖాన్కుల్ షంపి విరోథం సేసీది లేదు అని ఖబురు షంపీనాడు. దానీతో లడాయి మతౕబ్ అయింది.

కాలే—అయిసా! అయితే సిద్దీజోహార్ షని యేమి అయింది చెప్పు మియా.

రుస్తుం—సిద్దీజోహార్ బుద్దీపూరకంగా లంచం మేశి శివాజీకా యిడిసీనట్టు మేరా సుల్తాన్కు యిరాద్ కలిగి పరాబవం సేయడాన్కి ఆలోచన సేస్తూ వుంటే అదీ తెల్సీ సిద్దీకి ఖోపంవచ్చీ మంచీకిపోతే సెడ్డావచ్చింది అని షివాజీకా స్నేహం సంపాదించి కర్నూల్కు ఫోయి సుఖంగా వుండాడు.

కాలే—అరరే! మీాదీ సుల్తాను తప్పు యోచన్ సేసినాడు. తరువాత యేమీా జరిగింది.

రుస్తుం—తరువాత తన తండ్రీ షహాజీకా మోషంసేసినా బా

జీ ఘోరపడేకు మగణయాసేసి సావంతూకి భయం ఖబురు సెప్పి తోలి యేసినాడు. మాదీ రాజ్యం సబ్ దోల్సినాడు. అనంతర్ మహాజీ వచ్చి సంధీ సేసినాడు.

కాలే—వహ్వారే! మీకీ కలహాం సచ్చిపోయింది. మాకీ తయార్ అయింది. తర్వాత భగవాన్కా దయ.

రుస్తుం—క్యా భాయి! మీది ఔరంగజేబు గాడాయికీ తయార్ అయినాడు క్యా!

కాలే—ఔరంగజేబ్ నై. శాహాస్తేఖాన్ హాకిణీడుగాన్కి మాఫెంచాడాన్కి తయార్ అయినాడు.

రుస్తుం—ఓ శాహాస్తేఖాన్! ఇసూన్కా హావు రాసింది. షివాజీకాపేరు సెప్తే ఖాన్సాహేబుల్ గంగా మే కూద్తుండార్. మాయూకీ మగడు అప్జల్ఖాన్ సచ్చినాడు. శాహాస్తేఖాన్ గీహాస్తేఖాన్ క్యోన్, కిసాక్కా హై! యిప్పటిక్కి పదహారు సంవత్సరాల నుండి విజాపూరు రాజ్యం దోల్తున్నతుండాడు. గోప్పవజీలను మింగీనాడు. బలేబలేదుర్గాల్ దుగాల్ సంపాదించినాడు. మాదీ పుణ్యంసేత యిప్పటిక్కి షిష్టహాం అయినాడు. వాడు మనిషి కాడు. భగవాన్కా మాఫుక్ తలవానాలు.

కాలే—భాయి! క్యా బాత్కా తాణ్ హై! ఇది మొగలాయి పిండం. సస్తే సావాలు. బతికితే బతకావాలు. కల్లఘడితే గుల్ల సేస్తే కాన యిడిసి పెట్టం. మాకీ సందేహాం వకటి. సోమాజీ అంటే బార్తి సాక్యాసేత కొండాన్లైకి పోకాడాన్కి ఆమాసం యక్యా అవతాది కాని, తేకపోతే మేకపిల్లావలె కమిలి యేస్తాము.

రుస్తుం—బలేబలే తూ బడావస్తాద్ హై. నీకీ పాగ్ నాల్ మీద

ఆశవుంటే నాకీ వాలే లడాయివేళ అక్కడ అక్కడ తిరిగి బ్రతుకు. లే కాపోతే సచ్చిపోతావ్. అక్కడ చాకణ్ దుర్గంమే ఫిరంగోజీ నర సాళా బడా సేనాధార్ హై. మరాటీ కోటల్ మీకీ మాటలే కాదు. యేక్ అద్మి ఖత్రీఫ ద్దె వేలక్ వేలు సచ్చేదాకా తిరిగీ పోడు. ఆరంభ షూరత్వం మీదీపాత్రాల్ తీస్తాది. యిది నిష్చయం. హమారాబాత్ సునో.

కాలే—జానాదేవ్. ఇది ఒకమాటు నస్తే రెండోసారి యేమ్టి పస్తాది. ది క్యా జ్యావ్ మైబి చాకణ్ దుర్గంకా చెలేగావుంగా.

(నిష్క్రమింతురు)

---

చాకణ్ కోట సీను.

(శాయిస్తేఖాన్, కాలేషా, బహాదరల్లీఖాన్, వలీఖాన్ ప్రవేశింతురు)

శావా—క్యారే వలీఖాన్. సేనాధార్! యిది ఖోట నూపుల్కు సిన్నాది బలాన్కి గొప్పాదివాల మన్మి వచ్చినాపంగతి మరాటీల్కు తెల్వకుండా మెల్లంగా పైకీ యెక్కి లూటీ సేసి కోటనుంచి పుర్వాకూడా పోకుండా సంపావాల.

వలీ—మహారాజ్! సచ్ బాత హై! గడబిడా సేయకుండా ఒకడిమీద ఒకడు యింకొకడుమీద యింకొకడు యెక్కి మెల్లంగా బల్లీలాగ పాకావాల.

బహ—భాయి! ఫిరోఘుల్ యెక్కాకుండా నున్నంగా కొండ సాఫూ సేసినారు. యెక్కితే కిందాఫడీ సచ్చిపోతాం. బాగా యోచన్ సేయావాల.

శావా—అరేభాయి! దీనీకి ఒకటి సెప్తాన్. ఒకటి గట్టితాడు తేవాల. దానీకి కొంకి తగిలించావాల. అది మొలకి ఖట్కాని మెల్లంగా ఒకడు యెక్కి అక్డ గట్టిగా తగిలించావాల. అది ఫట్కాని అందర్ యెక్కావాల. అపుడు సిట్కిలో మరాటీలను సంపి కోట స్వాధీనం సేస్కావాల.

కాలే—(స్వగతం) అరేభగవాన్! యిదీమాట సెప్తే మేరా దిల్ దడదడా ఖొడ్తాది. మై క్యాకరనా. మాదీబూరాసి సూస్తే యెక్కావుందీ. తాడు ఫట్కాని యెక్కితే బడా ఆయామం వస్తాది. యెక్కాకుంటే ఘాడిచీయేస్తార్. వేరే మోస్తర్ సెప్పి తప్పించావాల. (ప్రకాశముగా) మహారాజ్! అది వీలూకాదు. తాడూఫట్కాని కోటామీదికి యెక్కినోళ్లసందర్శి మరాటీలు మరగయా సేస్తారు. క్యా ఫాయిదా సాబ్.

వలీ—ఖాన్‌సాహేబ్ జీ! కాలేపాకి ఖద్దు పెద్ద. అందుసేత ఆయామం వస్తాదుఅని యీలా సెప్తాది. కాని, మీ ఆలోచన బాగా వుంది సాబ్.

బహ—(నవ్వి) అచ్ఛా బాత్ హై. సచ్ హై.

కాలే—(స్వగతం) మాదీ ప్రాణాల్ కీ సైతాన్ వాల దాపరించీనాడు. (ప్రకాశముగా) క్యా బాత్ కర్తా హైరే. మై పత్నం సెప్పినామ్. తాడు ఫట్కాని కొండాపైకి యెక్కి గుండాకాకుండా రా! తమాష్ చూస్తామ్. మాటాకేమి. ఖరీద్ ఫెడతావు క్యా! పనీ సేయా

వాల. మాంట సెప్పి ఖోట యెక్కోనంటే వాటంకాదు. ధైర్యం పేషి ఖో ట స్వాధీనం సేసోక్కా వాల. ఝూటా బాత్ సెప్తే క్యా ఫాయిదా.

శావా—అరే కాలేషా! యేమిాటి సెప్తావ్? మాంకీ ఫికిర్ మందూ రాస్తావ్ క్యా! నీకీ సామర్థ్యం వుంటే యెక్కాలేకుంటే లేచీపో వాల. క్యా బాత్ కతా హై రే.

కాలే—(స్వగతము) మేరె కొంప మునిగింది. మాందీయిరాద్ వలీఖాన్ బైట బెట్టి మాందీ ప్రాణానిక్కి మోసం తెచ్చినాడు. అబి క్యా కహనా. నాతోడా బింకం సూపి మాందీ ప్రతాప్ సూప్తాను. (ప్రకాశముగా) నై నై మహారాజ్! మాందీ దిల్కు ఆలా తోసించేనాన్ సహీంతో తాడు ఫటోక్కని బెండూలాగ ఖోండా యెక్కానిక్కి నైా తయార్ హుం.

శావా—అచ్ఛా! అరే బహాదరల్లీ! యేక్ తాడు లగాం. జల్ది లేకరావ్.

బహా—అచ్ఛా మహారాజ్! (పోయి తాడుతో ప్రవేశించును)

శావా—అరే వలీఖాన్! కోండా పైకి పాకి మెల్లంగా తగిలించూ వాల.

వలీ—ఇది బహాదరల్లీ తగిలించావాల, అతడు మాందీకంటె మస్తుంగా వుంది.

బహా—మాంకీ కొంచం ఫికిర్ కాని తాఖత్ వుంది.

శావా—అరే వలీఖాన్! తూం తయార్ హూం!

వలీ—అచ్ఛా మహారాజ్! (తాడు లగాం పుచ్చుకొని) అరే! హల్లాభగవాన్ ఆప్కా సమస్కార్ కరతాహుం. మై ఖోండా యెక్కా

వాల. మోహం లేకాపోవాల. మహారాజ్కు జయం కల్గావాల. అరే ఖుదా. అరే మహరాజ్! కృపాకరో! (శావా స్త్రీఖానుకు కొండకు సలాం చేసి యెక్కుట నభినయించును) అరే! యిది పాకుడు పట్టింది. జారి పడితే సచ్చిపోన్ క్యా!

శావా—కుచ్ పికిర్ నై. అమంగల్ మత్ కరోభాయి! ధైర్యంగా వుండు.

వలీ—(కొంతవర కెక్కి తగిలించి అరేభాయి! నీవుకూడారా

కాలే—(స్వగతము) నాది పాణాన్కి వీడు మిత్తీవాలా వచ్చినాడు. యెక్కానంటే ఖాన్‌సాహేబు పాణం తీస్తాడు. యెక్కితే పడీసస్తాన్. మై క్యాకరనా. కానీ ప్రయత్నం సేస్తాను. (ప్రకాశము) అరేభాయి! నీకీ సలాం సేస్తాన్. గట్టిగా తగిలించి పట్కోవాల.

వలీ—కుచ్ పికిర్ నహీ. జల్దీ ఆవ్.

కాలే—(ఎక్కుట నభినయించుచు గడగడ వడకుచు జారును)

వలీ—అరే! పర్వా నై. మెల్లంగా పాకువోయి.

కాలే—పాకు గీకు జాంతా నై. పాణాన్కి మోపం వస్తాది. (తాడు జారి క్రింద బడును)

శావా—అరే! మొదటానుండి పడతాం సస్తాం. పడతాం సస్తాం అని శాపాలు పెడ్తావ్ క్యా! దూర్ జావ్. (గెంటివేయును) (తాడు యెగరవేయును)

కాలే—(స్వగతము) అరరే! మాకీ పరాభవం సేసినాడు. గేది పెర్గు మాకీ యిస్మాపక్ ద్రోహం పెంచింది. లేచిపోతే ప్యారీకి పిల్లల్‌కి పెంచాడాన్కి తాఖత్ నై. కొల్వు పల్పాడాన్కి వొళ్లూ పెర్గింది. కైసా జీవిత్ హుం.

వలీ—ఖాన్‌సాహేబ్ జీ! యిదీ కొండ బడా ఘాకుడు అంటించు కొంది. మెక్దాన్కి పీలు లేదు. సాబ్ కుచ్ ఫాయిదా నై.

ప్రథము—(అంతట గోటలోనివాడు లేచి) ఇట్టివేళ నీ జనసందోహరవంబు వాడముట కేమి హేతువో. (చూచి) అరే! మోసము లెందు లెండు.

ఉ. పాలకులార! మొగలు ల ♦ వార్య పరాక్రమ మొప్ప దుర్గ మిా
లీలను ముట్టడింప మర ♦ లింపక నిద్దుర వొవ్వుచుందురే!
మేలు కొనుండు సైనికుల ♦ మేళన సేయుడు శస్త్ర సంతతిన్
దాలుపరయ్య శౌర్యము బ్రి ♦ దర్శన సేయగ వేళయయ్యెడిన్.

ద్వితీయుడు—(లేచి)

గీ. ఇది తురుష్క దౌర్మార్గ్యంబు ♦ నెల్లమాపు
ఛత్రపతి యైన శివరాయు ♦ సైన్యనాధు
డగు పిరంగోజి నరసాళు ♦ డధిక భక్తి
నేలు చుండుట మొగలు ♦ లెరుగ రొక్కొ.

శాలే—ఖాన్‌సాహేబ్ జీ! అప్డు మై సెప్నీకీ లేవు

శావా—మత్కరో.

తృతీయుడు—

ఉ. చూచిన గార్యమే సమర ♦ శూరుల లక్షణమే శిరంబులన్
డాచిన సార్ధకంబె గుణ ♦ టాంకృతి జేసి శరాళిగూర్చి సం
కోచము లేక శత్రువుల ♦ గూల్చుడు కాల్చుడు గుండ్లచేత నెంతో చతురత్వ మొప్ప విబు ♦ ధుల్ వినుతింపఁగఁ గీర్తి నిల్పరే!

శావా—అరె వలీఖాన్! లడాయికీ సిద్ధం కావలయును.

ద్వితీయుడు పిరంగోజీ—

ఉ. మోగలులార! వైరి బల ♦ ముఁగ్గఁశియింపక గోవృషంబు ఝో
రీగల రీతి జూగి భ్రమ రించిన మమ్ముల గెల్వ శక్యమే
వేగమె మిమ్ములన్ జముని ♦ వీటికి బంపక మున్న పొందు దు
ర్యోగమునన్ దగుల్కొన బ్రి ♦ యోజన మేమి విమూఢ చిత్తులా

శావా—క్యారే బద్మాష్! క్యా బాత్కర్తా హై. అయనా

ఉ. క్యారె పిరంగి కూసెదవు ♦ క్యా అబి దేఖో మెరా ప్రతాప హై
మారణ కర్తహూం తుమ, త ♦ మాష వహావ్వరె! దేఖ్తహూంబలే
శైరహో యుద్ధరంగమె ఉ ♦ శావు హమార పిరంగిబార్ తుఝె
జోరు ఖలాసు చేసెదను ♦ శూరత హైతో కరో లడాయితుం.

పిరంగో—

ఉ. ఆటలె మా మరాటుల పు ♦ హత్తర దుర్గము లాక్రమింప మో
బోటులకున్ పధించుటకు ♦ బూరిని మేసెడు గోవు లీ నిరా
ఘాటముతో గ్రహించుటకు ♦ గామినులే యవనావనీరుహో
త్పాటన కారణం బగు శి ♦ వాజి యధీశు డటంచెరుంగవే!

శావా—క్యారే బద్మాష్! మాకీ బడాయిమాట ఘన్కరా దు. నీకీ సామర్ధ్యాం వుంటే లడాయికి తయారహో. నహీతో దుర్గం యిడిసీపెట్టి పారిపో.

పిరంగో—ఏమిది! నీవలె దంభప్రలాపంబు లాడువారము కా ము. పలికినంతయుఁ జేసి తీరెదము. మేసం ప్రాణము లున్నంతవఱకు గోటను మాత్రము మీకు స్వాధీనము జేయము.

వలీ—మీకీ శరీర్మె ప్రాణాల్ వుంటే కదా కోట స్వాధీనం చే యక పోవడానికి. వృధాగా నస్తావని మీకీ ఆలోచన చెప్పినాం. న హీతో మాకీ యేమి జానాదేవు.

పిరంగో—

గీ. పౌరుషమె జీవయాత్రగ ♦ బ్రతుకుచున్న
శివుని సైన్యంబు లారీతి ♦ సిగ్గు విడచి
ప్రాణభీతికి లోనయి ♦ పగతు రకును
దుర్గమిత్తురె శిరముల ♦ దుంపకుండ.

శావా—క్యా బాత్కర్తా హైరే. పిరంగోజీ! నీవీమాట సూస్తే మాకీ బడా నవ్వు వస్తుండాది. మాదీ అగ్గిలో మిడత అయి సావకుండా నీకీ ఆలోచన సెప్తామ్‌యినను. మాకీకోట స్వాధీనం సేస్తే నీకీ బడా సిలేదారు ఘని యిప్పిస్తామ్. మాదీమాట యిని బ్రతుకు లేకపోతె సచ్చిపోతావు.

పిరంగో—ఇసీ! యెంతమాట పలికితివి! అది నీచు లనుసరించు మార్గము సుమీ!

గీ. చచ్చినను శివకుమారుని ♦ సైన్యముననె
చావ వలెగాని తుచ్ఛమౌ ♦ జీవమునకు
నాసపడి స్వామి కపకార ♦ మాచరించి
విమతులగు మీకు గోట న ♦ ర్పింతు నొక్కొ.

శావా—జానాదేవు. మాకీ యేమి. నీకీ నెత్తిమీద సిన్నమ్మప్పగారు వుండాది ఛల్ జావు. లడాయికరాడరహో.

పిరంగో—ఓ! అంపులకు సిద్ధము కండు.

శావా—కోన్ హైరె వలీఖాన్! తుమ్మ యిక్కడా యుద్ధం చేస్తే కోట స్వాధీనం కాదు. మేము అందర్ దచ్చినాన్కి మెల్లి లడాయి చేస్తూవుంటాము. నీవు యీవైపున వుండి కోటకింద ఖన్నంతవ్వి మందుకూరి అంటించవాలా. అప్పుడుకాని మనకు స్వాధీనంకాదు.

వలీ—అచ్ఛా మైకన్నానికి తయార్ అవుతాం మీరు యెల్లండి. (వలీఖాను వివగా అందరు నిష్క్రమింతురు.)

వలీ—దుర్గాన్కి దచ్చినాని అందరు లడాయిచేస్తూ వుండారు మరాటీవాడు యిక్కడ లేకుండా యెల్లినారు యిక్కడ మైకన్నం తవ్వి మందు అంటించటాన్కి బాగా యీలువుంది. (తెరలో వున్నవారిచే తవ్వించు చున్నట్టుల అభినయించును.) అరే సేవక్ బడా పోదు గుకన్నం తవ్వాలా (ఆకాశమువంక జూచి) యేమిటి అంటావ్ కోట గోడదాటి బీస్ గజాల్ వరకు తవ్వాలా అని అడుగుతావు క్యా, హాం. అచ్ఛామాట చెప్పినావు నహీతో పెద్దగోడ యేలావడ్తాది మరి నకితోవా యేలా అవుతాది, అరే ఫని ఝల్దీగా చేయవాయి (చూచి) అరరే మరాటిసేనచూస్తే తోడాగావుంది మాదిపెద్దసేనాకి వటకోని యేలామూర్ఖ చేస్తూవుండాది. అబ్బబ్బా పీడుఫిరంగోజి నర్సాలా పత్యంగ పెద్ద ఫిరంగి, నహీతో యింత సేనాకాల్చి యేస్తాదు క్యా! యీాను బడాపోటుమానిసి హై. (తెరలో)

ఫల్లీఖాన్ సాబ్! ఖన్నంతవ్వినాం మందు బాగా కూరినాం. అంటించమంటె తయార్ అవుతామ్, యేమియాజ్ఞ.

వలీ—(ఆలకించి) అచ్ఛా జల్దీగా అంగార్ అంటించు. కుచీఫికర్‌నహి (అప్పుడు పెద్దచప్పుడుతో కోటగోడ కూలుటయు మంటలు లేచుటయు ఆమార్గమున యవనులు కోటలో ప్రవేశింప యత్నించుటయు)

(ఫిరంగోజి నర్సాల యెదుర్కొని)

ఫిరం—ఓరోరి మొగలులారా!

మత్తకోకిల, దుర్గభేద మొనర్చినామని తుళ్ళిపైబడ రాకుడీ

నిర్గమించు నెవండు నే నిట నిల్చి దుర్గముగా యగా
భర్గునైనను లెక్కసేతునె బల్మిమై మిముఁనందరన్
దుర్గకర్పణగాగ శిరముల దుంపకుందునె మ్లేచ్ఛుడా.

శాహి—కోన్ హైరే బేహయా మాకీ బెదిరిస్తావు క్యా! నీకీ మారక్ చేసీ కోట నిశ్చయముగా స్వాధీనం చేసుకుంటామ్. ఫూకీకే ప్రితాపాస్కి పోయి యెందుకు చస్తావురే! లడాయీకీ టాడ్ రహో, నహితో లేచిపో! (ఇక్కడ కావలసిన యుద్ధము చేసుకోన వచ్చును.)

(అంత సేవకుడు ప్రవేశించి ఫిరంగోజీని చేరి)

సేవ—అయ్యా! స్వామిభక్తిపరాయణ! నమస్కారము. దుర్గము శత్రువులకు వదలి రమ్మని ప్రభువుగారి యాజ్ఞ అయినది.

ఫిరం—అది నిశ్చయమేనా?

సేవ—శివ సేవకులు అసృతముకు నవకాశ మిచ్చెదరా?

ఫిరం—అట్లయిన యిదుగో నెరవేర్చెదను. ఓ యవన ప్రభువా! మా ప్రభువుగారి యాజ్ఞాప్రకార మీకోట దుర్గమును విడచి వెళ్లుచున్నవాడను. నీవు స్వేచ్ఛగా ప్రవేశింప వచ్చును.

శాహి—క్యాజి భాయి! నీది స్వామిభక్తికి ప్రితాపాస్కి మేరాకు బడా సంతోసం అయినాది. మాది రెండువేల సైన్యంతోటీ నీది నూరుమందితో లడాయికీ తయారై సావుకైనా సిద్ధం అయినావుగాని కోట యిడిసినావు కావ్. నీది బడా షౌర్యం హై. నీది ధైర్యం. మాది అవురంగ జేబ్ తోటి సెప్పి నీకి గొప్పగొప్ప బాదర్ బిరుదుక్ ఖిల్లాల్ యిప్పిస్తామ్. వస్తావ్ క్యా!

ఫిరంగో—

సీ. బిరుదుల కాశించి ♦ విశ్రుత ధర్మము

ల్గలుషం బొనర్చు తో ♦ కయ్యగాను

ధనకాంక్షచే దేశ ♦ ధర్మమ్ము విడిచిభూ

పతికి గీడొనరించు ♦ పశువు గాను

తన సౌఖ్యమున కన్య ♦ మనుజుని దోష సం

కరునిగా జెప్పు తుం ♦ టరిని గాను

తన ప్రాణములు నిల్వ ♦ ఘనులపై నిందల

సారిది జెప్పించు తు ♦ చ్ఛుడను గాను

గీ. చచ్చినను వెంట వచ్చెడి ♦ సద్యశమ్ము

నందెదను గాని యపకీర్తి ♦ నంద సుమ్మి

ధనము బిరుదులు పైనిడి ♦ తగులబెట్ట

ననువు పడుగాని పురుషార్థ ♦ మగునె చెపుమ.

శాహి—జానాదేవ్ ! మ్హాకి కూచ్ జరుగురు నహి. నీకి మ ర్యాద చేసినామ్. మాకి అఖ్కల్ లేదు అంటే మై యేమి శెయ్యవా లా ! ఛల్ జావ్ !

ఫిరం—ఓ దుర్గ రాజమా !

ఉ. కాలవశంబునన్ భట ని ♦ కాయము చాలమి మ్లేచ్ఛ సేన చే

వ్రీలిన దానవైన నిను ♦ వీడక ప్రాణము లుండు వాక ని

న్నేలగ నున్న యంత సచ్చి ♦ నీశుని శాసన మాటచేత నీ

లీలను సిగ్గుబో విడిచి ♦ మ్లేచ్ఛుల కిచ్చితి నిన్ను స్వల్పమౌ

కాలములో శివాజ్ఞగొని ♦ క్రమ్మర నేలెద దుర్గరాజమా !

(ఈ కోటకు నమస్కరించి మరాటీలు పోవు చున్నారు)

శాహి—కోన్ హైరే వలీఖాన్ ! భగవా జెండాలాగి అమారా జెండా తగిలించు.

వలీఖాన్—ఓ ! అచ్ఛాగా చేస్తామ్ !

(అందరు నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము.





శ్రీ

# మహారాష్ట్రవిజయము

## సప్తమాంకము.

రంగము—ఢిల్లీ పురము.

(పౌలాద్‌ఖాన్ ప్రవేశించును.)

హమారా ఢిల్లీపాదుషహా ఔరంగజేబు మాకీ బులావ్ సేసి కోన్ హైరె కొత్వాల్ పౌలాద్‌ఖాన్ షివాజీకి ఖైదుసేసినాం గనుక నీవు మెల్లి బహుత్ ఖబడదార్‌గా షారా యాంయాలా అని మాకీ ఆజ్ఞాయిచ్చినాక్. కాని షివాజీగారు షట్యంగా సంధి జరిగింది అని తల్సి పాదుషహాగారి దర్శనాన్కి వచ్చినాడు. ఔరంగజేబు అయితు ఈ దూడోంగా దొరికిందే చాలూ అని తల్సి ధర్మం లేక మాదీ ఆజ్ఞా లేకాపోకూడదు అని సెప్పీ మాకీ కావ ల్యుంచీనారు. అబి పులిపిల్లా బోనూమే సిక్కింది. థొడ్డిరోజుల్ వుంచీ బిస్‌మిల్లా సేస్తారు. అయితేకాని షివాజీకాపేరు సెప్తే సబ్ దేషాన్కి నిద్దర్ పోదు. మన్కు ష్వాధీనం హాయిందీ అని శావాస్తేఖాన్ సాహేబు పుణాదుర్గంమే నిద్దర ఫోచుండగా పెల్లీవాకితో మిల్లాంఖత్ అయి కోటమే దూరి ఖాన్‌సాహేబ్కు కత్తి యిసికితే కంఠం తప్పీ సిటికినయేలు తెగీ ప్రాణంతోటీ బతికి బైలాఫడి పాకిపోయినాడు. అవుడు షివాజీ ఖాన్‌సాహేబ్ బి

డ్డాకీకూడా నరికీ చంపి ఆడోల్లుకు మర్యాదా సేసీ యిడిసీ దుర్గం స్వాధీనం సేస్కొన్నాడు. అట్టాగంటే షివాజీ యిక్కడా గేలాన్కి తగులూకొన్నాడు. ఇపుడూ ఇది ఫారా యిస్తే మాకీ నరికీ యేస్తాడూ అని ఫికిర్ హావతాది. మై క్యా కరణ. రాజూకా దాస్యం అయిసా బడా కష్టం యిస్తాడు. ప్రాణాల్ సేతులో ఫెట్కోని యీయాలా. మై చెలే గావుంగా (నిష్క్రమించును)

ప్రవేశకము.

---

రంగము—ఖైదు మందిరము.

(శివాజీ శంభాజీ రామసింగు ప్రవేశింతురు)

శివాజీ—

శా. అన్నా! యెంతటి మాయజేసె నను నీ ♦ యౌరంగజే బింతకున్
మున్నే సంధి యొనర్చి కొంటిమిక యే ♦ మోసంబు వాటిల్ల దం
చెన్నో యూహల నేసి నమ్మితిని డిల్లీ ♦ శుండు దుర్మార్గుఁడై
నన్నీరీతి బరాభవించునని నే ♦ నమ్మంగ లే దక్కటా!

రామ—దేవా! సహజవక్ర చేతస్కుండైన ఔరంగజేబుని సత్పురుషునిగా భావించి విశ్వసించుట మనదే లోపము. ఎట్లన!

ఉ. కాయము రోగ పూరితము ♦ కల్గెను తండ్రికిఁ జెంతనున్న దా
రాయను సోదరుం డొకడె ♦ రాజ్యము చేకొను నంచు నీర్ష్యచే
డాయఁగఁ వచ్చి యన్నల ద ♦ డాలున జంపియు దండ్రిగూడ, గా

రాయతనంబునం దిడిన ♦ యట్టి దురాత్మున సత్య సంధుడే.

శివా—రామసింగు ! నిక్కము వచించితివి.

చ. జరిగిన సంధి సత్యమని ♦ స్వాంతము నందున నమ్మి యా విజా
పురి సులతానుతో బవర ♦ మున్ జయసింగును గూడి చేయఁగాఁ
బరపితిఁ బెక్కు సేనలన ♦ వారిగ నా యుపకార సత్త్వచే
ధరణి ననేక పట్టణ స్వ ♦ తంత్రిత కల్గుట దల్ప డాయెగా !

రాజ—స్వామీ ! మీ రిట్టి వెఱ్ఱి యూహలఁ జేయుచున్నారు కా ? ఔరంగజేబునకు రాజ్య తృష్ణయను పెద్దరోగము కలదని ప్రపంచమున నెవ్వ రెఱుంగనిది. అది కాక ఢిల్లీరాజ్యములోని ముప్పది రెండు దుర్గములు లాక్రమించుకొని రాష్ట్రమంతయు గల్లోలపరచి తుదకు దుర్ఘటముగా నిరువది చిన్న దుర్గముల నిచ్చినంత నే మీయందు వానికి పగతీరునా ! నిన్నగాక మొన్న శైలుదేరి మువ్వురు తురుక దొరల నడల నెట్టి అందరి మధ్యమున బ్రహ్మాండమైన హిందూరాజ్యమును ప్రతిష్ఠించిన మీ యందు పగ తీరునా ! దేవా !

శివా—ఓయీ ! నీవు వచించినది నిక్కవమే అయినను

ఉ. నేరమేదేనిఁ జేసితివి నీవని నన్నబరాభవించుటల్
పౌరుష మానుకాని దయ ♦ వారును నీ వయి గౌరవింతురా
గోరెదనంచు బిల్చినను గొంచెపు బుద్ధిని జూచి యంతతో
దీరక బందిఖానను వి ♦ ధించుట వీని కిదేటి ధర్మమో.

రాజ—స్వామీ ! దౌర్మాగ్య దేవతకు ధర్మగుణము నా డమునా ?

శంభాజీ—నాన్నగారు ! మన మున్నది చెరసాలా !

శివా—నాయనా ! నిజమున కిది చెరసాల కాకున్నను ఢిల్లీశు

డు మనపై పహారాయుంచి దీనిని చెరసాలగానే చేసినాడు.

శంభా—నాయనా! ఈ తురుక ఖైదు చేయువాడు మన మీ దుండువారమునా! తండ్రీ! ఖడ్గము ఖడ్గము.

గీ. ఎల్లవారల చెఱబాపి • యేలుచుండు
మనల నెవ్వడు చెఱలోన • నునిచెనయ్య
గడ్డిపోచలు సింగమున్ • గట్టునయ్య
ఇట్టిదానికి యోజన • లేల తండ్రి!

రామ—(స్వగతము) హరికి హరి కిశోరమే యుదయించును కాని హరిణ ముదయించునా!

శివా—కురారి! ప్రస్తుతము విజృంభించుటకు వేళ గాదోయి!

రామ—దేవా! మన ఆయుష్మంతుని వాక్యములు నా కభిమన్యు కుమారుని దలంపునకుఁ దెచ్చుచున్నవి.

శివా—అన్నన్నా! నే డెట్టి దుర్దినమో కాని పుట్టిననాటనుండియు వేఱొక శాసనమునకధీనుడనై యుండక స్వాతంత్ర్య సౌఖ్యమున నానంద మనుభవించు చున్న నేను నేడొక్క తురుష్కుని శాసనమునకు బద్ధుడను కావలసి వచ్చినది గదా! ఈ కపటి నన్నెవు డేమి చేయదలచి కొన్నదియుఁ దెలియకున్నది. తల్లీ! భగవతీ! నీ పుత్రునకేమి యాలోచన జెప్పెదవు. (ఆలోచించి) ఓ రామసింగు! నీవు పాదుషహా చెంతకు బోయి నా మాటలుగా నిట్లు చెప్పుము. ,,మాకీ యుదకములు శరీరములకు రోగమును కలిగించుచున్నవి కావున మాకు శెలవిండు. అట్లు కాదేని మా సైనికులకైన ఆజ్ఞ నిప్పించుడు,, అని చెప్పి వేగ నాజ్ఞగొని రమ్ము. మన విచారము మాత్రము మో

మున ద్రోహకుండ నటింపుము. పొమ్ము.

రామ—చిత్తము. (నిష్క్రమించును)

ఫౌలాద్‌ఖాన్—(ద్వారమున) కోన్ హై. కిధర్‌కు చలేగయా హై రహో! (ఆపును)

రామసిం—ఓకీ! నేను పాదుషహా గారి దర్శనమునకై పోవుచున్నాను.

ఫౌలాద్—సత్యం అయితే వెల్లు. లేకపోతే ఆగిపోవాల.

రామసిం—నిజమే! మే మసత్యత మాడువారము కాము.

ఫౌలాద్—అచ్ఛా, జావ్.

శివా—(స్వగతము) ఓ యవనప్రభువా! ఔరంగజేబా! మాయమాటలచే నను రప్పించి ఖైదు చేసితినని సంతసింపకుము. వాస్తవ పౌరుషు లెప్పుడును కృత్రిమ జయమునకు సంతసింపరు. నశ్వరమైన యీ కాయమును బంధింపఁ గలిగితివి కాని గమ్యస్థానమును చేరిన నా యంతరాత్మను బంధింప నీ తరముకాదు. ఈశ్వర కార్యమును చేయునది నా యంతరాత్మ కాని నా దేహముకాదు. మరియు పాంచ భౌతికమైన నా దేహము నశించినను నా యుద్యమము సంపూర్తిగ జేయబడియే యున్నది. కానున్నను నా వంటి వార లనేకులు నా యనంతరము నా పూన్కిని పరిరక్షించువారు కలరని తెలిసికొనుము. కానిమ్ము, మోసముచే నన్ను వంచించితివి కావున నిన్ను మోసము చేతనే వంచించెదను గాక,

(రామసింగు తిరిగి ప్రవేశించును)

రామ—దేవా! నమస్కారము.

శివా—ఓయీ! ఔరంగజే బేమని యుత్తరవు చెప్పెను.

రామ—మీ సేనలు మాత్రము పోవుట కంగీకరించితిమికాని శివాజీతో యింకా ప్రసంగించ వలసియున్నది కాన శివాజీ పో వలను పడదు,, అని పలికెను.

శివా—మంచిది. దీనియర్థమును గ్రహించితివా ?

రామ—సైనికులు వెడలిన పిమ్మట మనల జయించుట మిగుల సుగమమని తలచినట్లు తోచుచున్నది.

శివా—ఇంకా సందియమేల ! అదియె వాని నిశ్చితార్థము కాని యదియే మనకును మిక్కిలి యుపయోగము.

రామ—అదెట్లు ?

శివా—(చేరబిలచి) ఇట్లు. (చెవిలోఁ జెప్పును)

రామ—చిత్తము. (లోనికి పోవును)

అందరు—(లోనికి పోవుదురు)

పోలాండ్—క్యోంరే పఠాన్ సాబ్ ! సింగం బోనూమే తగులూ కొన్నాది. అబి మన్ము ఖబడ్దార్ గా వుండాల.

పఠాన్—క్యా బాత్కర్తా హై జీ ! సింగం తల్చూకుంటే హమార రక్షు గిక్షు జాంతా నై. కండ్లాకి దుమ్మూ ఖొట్టి చడా యిస్తాది.

(అంతట నొక సేవకుడు శిరమున బుట్ట పెట్టుకొని ప్రవేశించును)

పోలా—క్యారే ! ఏమిటీ అది.

సేవకు—(చూపులకు కొంచెము వెనుదీయును)

పోలాండ—అరే ! మై దేఖ్తాహుం. (చూడబోవును)

సేవకు—దీనిని ముట్టుకొనవలదు. నేను నీకు చూపుటకే తెచ్చి

నాన. (బుట్ట విప్పి చూపును)

పొలాద్—క్యాంజీభాయి! మిఠాయి తెచ్చినావ్! ఎక్కడిక్కె మోస్కాని మెల్తావ్?

సేవకు—మా మహారాజుగారి స్నేహితులీ పట్టణమున ననేకులు కలరు. వారికి విందు సేయుటకు మా ప్రభువుగారు పంపుచున్నారు.

పొలా—ఇదీ సబ్ మిఠాయి! సహీంతో మనిసి అడుగున వున్నాడు క్యా!

సేవకు—లేదు లేదు. చూచుకొనుము. (బుట్టవిప్పి చూపి కొంచెము మిఠాయి వారలకు బెట్టును)

పొలాద్— } (ఇద్దరును తిని హైకె పెక్కూట నభినయించి)
పఠాన్— } అరే! మాకీ హైకె పెక్కూ సూండాదీరే. (అనిద్రింతురు)

సేవకు—(తనతో) దీనిలో మీపని మట్టమగును లెండి. (పోవును)

(తరువాత పలుసార్లు మిఠాయి బుట్టలు వెడలును)

(అంతట మొగలుడు ప్రవేశించును)

షేక్ ఆలీసాబ్—కోన్ రే పొలాద్ ఖాన్! క్యా కర్తా హై.

పొలాద్—మై యేమీసేస్తాం. కాపూవుండాం.

షేక్ ఆ—అచ్ఛా! (అని లోనికి పోగా తెరలేచును. మంచముపై శివాజీ శాలువ కప్పుకొని శయనించుట. సేవకుడు విసరుచుండుట. బ్రిదర్శనము సేయవలెను) (వారితో) ఓ అయ్యా! మీడి షివాజీగారు యెమిటీ సేస్తున్నార్ సాబ్!

సేవకు—బిగ్గరగా మాటలాడకుము. మా మహారాజుగారు శిరో వేదనమున బాధపడు చున్నవారు.

షేక్ ఆలీ—ఓ అయిసా క్యా! అయితే మై వెళ్లి పోతాం. (తిరిగి తనలో) మాదీ దేషంమే పాణీ షివాజీ ప్రాణాల్ తీస్తాడు. ఇదీ సంతోసం. మాందీ చకర్వతీకి సెవులో యేస్తాం. (నిష్క్రమించును)

సేవకు—ఏమందుచేతను ప్రభువుగారి శిరోవేదన నివారణ కాలేదు. మరొక మందున్నకై పోవలెను. (నిష్క్రమించును)

పౌలాద్—హా మూరా ఔరంగజేబు అదృష్టం క్యా కహానా. షాయిప సంపాడాన్కి కష్టం లేకుండా తలనొప్పివాడు శివాజీకా మరగయా సేస్తుండాడు.

2వ సేవకుడు—(తలగడ శివాజీవలె బెట్టి శాల్వకప్పి తానులేచి) మందునకు పోయిన సేవకుడు రాక జాగు చేయుచున్నవాడు. వానిని తీసికొని వచ్చుటకు నేను పోవలసివచ్చుచున్నది. వాడు కేవల మూఢుడుకదా ? (నిష్క్రమించును)

(అంతట ఖాన్‌సాహెబు ప్రవేశించి)

ఖాన్—అరే పౌలాద్‌ఖాన్ ! షివాజీ అందర్ యేంసేస్తుండాన్ రే !

పౌలా—తల నొప్పీసేతా మూల్గానున్నారు.

ఖాన్—అయిసా క్యా! మాంకీ సూసీరమ్మనీ ఫాగుషా పంపీనార! మై సూసీవస్తాం. (జంకుచు పోయి చూచి యెవరిని గానక) ఓ అయ్యా! యిక్డా యెవరు వుండారుసాబ్ ! (ఆగి) ఓ అయ్యా ! మై షివాజీమహారాజ్కా దర్శనాన్కి వచ్చీనాం సాబ్ ! (ఆగి) అరె యెక్డా పడీలేదు. ఓ సాబ్ మాటల్ రాదు క్యాజీ ! అరే యేమిటీ ఆవ్వ

ర్యంగా వుందీ! క్యారె పొల్హాద్ ఖాన్! షివాజీగారి జబానులు ఏమి చ్చేస్తావుండారు?

పొలా—క్యాజీ! నౌకర్లు ఔషధాన్ని మెల్లీనార్! షివాజీ వొల్లు కానకుండా వుందుర్! మంచంమే నిద్దర్ పోసుండారు. గడబిడ్ సెస్తే లేచీ సంపీ యేస్తార్ అయ్యా!

ఖాన్—అరే! ఒకడూ లేకుండా అందర్ మెల్లీనారూ క్యా!

పొలా—దెఖోజీ!

ఖాన్—(తిరిగి బిగ్గరగా పిలచి) మంచమువద్దకు పోయి మెల్లగా శాలువమెత్తి చూచి ఆశ్చర్యముతో) అరె పొలాద్‌ఖాన్! యెక్కా షివాజీ సూపువొయి!

పొలా—(వచ్చి చూచి ఆశ్చర్యముతో) అ, రె, రే, రె, రే, షి, షి, షీ, జి, జి, మో, మో, షం,

ప్రతాప—నై నై మహారాజ్! సేవకుడు అబిమెల్లీనాడు సాబ్

ఖాన్—(ఒక దెబ్బకొట్టి) క్యారే! లంచంమేసీ షివాజీకీ ఇడిసీ నావు! నీకీ నతికీ ఫైడతాం!

పొలాద్—మహారాజ్! ముఝె కుచ్ మాలుం నహీంజీ! మై అల్లాతోడు,

ఖాన్—అరే బద్మాష్! ఔరంగజేబుతోటీ సెప్పి నీదీ వొల్లు చీలించి రక్తం తాగిస్తాన్! దేఖో మేరా ప్రతాప్! చెలోజావు. (కొట్టుచు నిద్ధరిని తీసుకొనిపోవును) (నిష్క్రమింతురు)

ఇది సప్తమాంకము.

శ్రీ

# మహారాష్ట్రవిజయము.

## అష్టమాంకము.

రంగము—ఢిల్లీపురము.

(సోయేరాబాయి ప్రవేశము.)

సోయే—హా దేశసముద్ధరణశాలీ! హా ప్రాణేశ్వరా! హా శ్రీ ఛత్రపతీ!

మ. అకటా! ధర్మములేక శత్రువులు • కారాగారమందుంచి నిన్
గికురింపంగ నెటుల్ సహించితివో • నే నీవార్త విన్నంతనే
వికలంబయ్యె మదీయ మానసము జీ • వింపంగ నేజాల మి
మ్మొక దేవుండును బ్రోవ నడ్డుపడడే • యయ్యో! నా మనోనాయకా!

అన్నా! యతోధర్మస్తతోజయమ్మను నార్యోక్తి మీపట్ల నిష్ఫలమయ్యెనా జీవితేశ్వరా! కేవల వాక్శూరులవలె దంభప్రలాపాటోపము కాక సంపూర్ణముగ నామానవశిష్టమైన మహారాష్ట్రధర్మమును పునరుజ్జీవింపఁజేసి యనేకోపద్రవ సముద్రమగ్నులైన మహారాష్ట్రుల నుద్ధరించి ఖడ్గముల వాతబడకుండ గోవులను రక్షించి నవశక కర్తవైన నీకీ యవన నిరోధము సంప్రాప్తమైనపుడు నీవు చేసిన పుణ్యకార్య ఫలములలో నొకటియు దోడ్పడకుండుట నా దౌర్భాగ్యముకాక మరే

మున్నది. ఒక నా దౌర్భాగ్యమే కాదు. మహారాష్ట్రముయొక్క దౌర్భాగ్యము. ఏలయన,

ఉ. ఎందరి బందెనుండి వెలి • లించి సుఖంపఁజేసినావొ నీ
వెందరి సుందరీమణుల • నెత్తెరఁ బ్రోచితొ మ్లేచ్ఛజాతిచే
గుందఁగ నీక భూమిసుర • కోటుల రక్షణ సేయలేదె నే
డెందరి కన్న నెక్కుడగు • హీనపు బంది గృశించుచుంటివే.

హా జీవితేశ్వరా! ఈతకాని కేటివలననె ముప్పు సంభవించునందురు. అటులే తురుష్క రాజుల దౌర్మార్గ్యమును సంహరించిన నీకు దుదకు దురుష్కనిరోధమే సంభవించెను. అందుచే నా డెందం బాందోళన మొందుచున్నది.

సీ. నీ ప్రభావంబున • నేకదా! యసమాన
శివశబ్దమయమయ్యె • క్షితితలంబు
నీదు జన్మంబున • నేకదా! దేశమా
త కుమారవతియంచు • దనరెయసము
నీ విజృంభణమున • నేకదా! మతధర్మ
ముల యంకురమ్ములు • నిలచెఁ జగతి
నీ ప్రతాపంబున • నేకదా కొదలేక
మాతృదేశము వీర • మాత యయ్యె
గీ. నీ శతంబుననే ధర • ణీసురులును
మానినులు గోవులును ప్రాణ • మానములను
నోచుకొన గల్గె నట్టి ధ • న్యుండవీవు
నీవు చెరబడ నేరీతి • నిలుచు జగతి.

హా స్వార్థత్యాగీ! ప్రాణేశ్వరా!

చ. కడిపెడు తేగతోడ జన ♦ కంటకమై యవమాన పూర్ణమై
కడవకు మించినట్టి చను ♦ కట్టు ధరాస్థలి నంటి వ్రేలగా
నడువంగ లేని గోవుల న ♦ నారతమున్ వధియించునట్టి యా
చెడుగు తనంబు గూపరంగం ♦ జేసిన పుణ్యము మిమ్ముం బ్రోవదే!

ఓ యవన ప్రభువా! ఔరంగజేబు చక్రవర్తీ! నీ కదేటి కీర్తి. చక్రవర్తుల కిది ధర్మమా! మా యలమట నీవిగా తలచుకొనినయెడల నా భర్తగారి యుద్యమ మక్రమమని నీకు దోచదు. నీవు వెర్రివాడవు. లేకున్న నా ప్రాణేశ్వరు నొక్కని బంధించిన మహారాష్ట్రజాతియు విజృంభణం బడంగునని తలంతువా?

మ. ఒకచోం బుట్టినదీ విజృంభణ మను ♦ టం జూహింపగా బోకుమీ
సకల ప్రాణి నిశాంతమైన మహారా ♦ ష్ట్రంబంతటన్ నిండి వ్యా
పకమై వ్యాప్తమై తగుల్కొనుచు తీ ♦ వ్రత్వంబునుం బొంది నే
టికి నుజ్జృంభణమై బయల్పడె మరా ♦ టీతేజమం చెంచుమా!

అదియుం గాక,

గీ. తిమిర వర్గలమైన రా ♦ త్రియును గడచె
సుప్రభాతంబు నయ్యెను ♦ సుప్తులైన
జనులు మేల్కాంచి నిజధర్మ ♦ సరణిదిరుగ
వారలను నిగ్రహింప నీ ♦ వశమె చెపుమ!

కావున నిది దురభిమానము కాని వేఱు కాదు.

చ. తెలివి యొకింత కల్గినను ♦ ద్వేషము భేదము జాతి వైరమున్
గలుగక యుండ రాజ్యము సు ♦ ఖంబుగ బాలన జేసితేని భూ
తలమున నీ యశాంతియు ను ♦ దాయదశౌ నశియించు దేశ పు
త్రులును విశేష గౌరవము ♦ తో నిను జూతురు మ్లేచ్ఛ భూపతీ!

అల్లోల జరుగును. నీ మతమే నీకు బ్రధానముకాని దేశమున గలవర మడచు మార్గము మాత్రము నీ వెఱుంగకున్నావు. తల్లీ! మహారాష్ట్రమాత!

చ. కడిపెడు బిడ్డల న్గని సు ♦ ఖంపడ కన్యులు పెట్టు కష్టముల్
గుడుచుచు నున్న నిన్ను నల ♦ కూళలనుండి తొలంగజేసి ప్రే
ముడి చెలువారగాఁ బురుష ♦ పుంగవుడైన శివాజి తేలి యి
ప్పుడు విధిచేతఁ గష్టముల ♦ బొందుచు నుండెను బందిఖానలో.

అయ్యో! ఎంత కష్టము. నా ప్రాణేశ్వరుండు బందినుండి యెట్లు వెలువడునో దైవమా! కట్టా! ఈ నిర్భాగ్యురాలి కట్టి సంపద కలుగునా? కుమార వియోగంబున మా యత్త జిజాబాయి యెంత పరితపించుచున్నదో! ఆమె సాకంబె ధైర్యస్వభావ అయినను కన్నకడుపగుటచేఁ బొగలక మానదు. భవానీపూజార్థము మా యత్తగారిని దోడి తెచ్చుటకు బోయిన చేటిక యింకను రాకయున్నది.

(అంతట చేటిక ప్రవేశించుచు)

చేటిక—అమ్మా! భవానీపూజనమునకై మీ యత్తగారు వచ్చుచున్నారు. మిమ్ములను సిద్ధముగ రమ్మని చెప్పుమన్నారు.

సాయే—ఓసీ! నేనును సర్వసిద్ధముగానుంటినిగదా!

చేటిక—అమ్మా! అల్లదె యవనికాంతరమున భవానీదేవి తన భక్తునియెడల జేసిన యపరాధమునకై యాగ్రహించినదో యనునటులు అరుణ వస్త్రాలంకృతయై జపాకుసుమ సంకాశమైన ముఖకాంతితో జూపట్టుచున్నది చూడుడు.

(అంతట తెరలేచును. భవానీదేవి సందర్శనము. జిజాబాయియు బ్రాహ్మణుడు ప్రవేశింతురు)

సాయే— }
జిజా— }

గీ. కామితార్థ ప్రదాయిని • కలుష శమని
సకల శత్రు వినాశిని • సకల జనని
పాలితాఖిలలోక ది • వ్య మునివంద్య
వందనంబిదె మముఁ బ్రోవ • వమ్మ దేవి.

అయ్యా! భూసురోత్తమ! పూజ సేయించుడు.

బ్రాహ్మ—అమ్మా! చిత్తము. దయచేసి కూర్చుండి ఆచమనము సేయుడు.

సోయెరా—(అటులు కూర్చుండి ఆచమనము సేయుచున్నది)

బ్రాహ్మణు—కేశవ, నారాయణ, మాధవ, హరె శ్రీకృష్ణాయనమః. (తెరలో) అమ్మా! జయము జయము.

జిజా—ఓరీ! ఏమివార్త!

సేవకు—(ప్రవేశించి) తల్లీ! శివాజీ మహారాజుగారుడిల్లీనుండి వెలువడి నారనియు ద్వరలో వచ్చుచున్నారనియు దెలియవచ్చినది.

సోయెరా—ఏమీ! ప్రాణేశులు తురుష్క గ్రహ విముక్తు లయ్యెనా! ఓరీ సేవకా! నీవీ హారమును పారితోషికముగా గొనుము. (హారమును దీసి యిచ్చును)

సేవకు—మహాభాగ్యము తల్లీ! (గైకొనును)

బ్రాహ్మ—అమ్మా! భవానీకృపాపరిపూర్ణులైన శివాజీ మహారాజుగారా యొకని శాసనాధీనులై యుండుట? వారును యింతలోనే విచ్చేయుదురు.

జిజా—బ్రాహ్మణ వాక్య మమోఘమగుగాక. వేగ బూజ

:యించుచుదు.

బ్రాహ్మ—అమ్మా! చిత్రము. పుష్పములను చేత గ్రహిం
పడు. ధ్యానం—॥సమస్త దుష్టశతుఘ్నీం, సర్వసౌఖ్య జయావ
ం, కాళీంకరాళవదనాం, కాలజీమూతసన్నిభాం, భీమదంష్ట్రోజ్వ
ం వందె నేత్రాంతర శిఖోజ్వలాం॥ అష్టనాగావృతాం కన్యాం అష్ట
ర్ణవిగ్రహం, సమాస్త్ర భుజదండోద్య త్సహస్రాయుధశోభి
ంబిభ్రతీంకింకిణీమాలామాపాదతలలంబితాం॥ శివాంపరప్రియత్న
ఘ్నీం, పరరుధిరపానోన్మత్త పరాం పరరాజ్య ప్రదాయినీం భద్ర
ళీం భవానీం భజేహం భజేహం భజేహం.

(అంతట శివాజీ బైరాగి వేషముతో ప్రవేశించి)

శివా—శ్లోకము.

నా సస్య ఫలాంచితాగపులక శ్రీ శోభితాంగ ప్రభాం
నానంద మయీం శ్రితావనహిత స్వాంతాం త్రిమూర్త్యాత్మికాం
సింధాశ్రిత పాదపద్మయుగళీం మత్తారి విచ్ఛేదినీం
ణీం పూత తరంగిణీ విలసితాం వందే మహామాతరం.

(భవానికి సాష్టాంగ నమస్కారము సేయును)

అందరు—(ఆశ్చర్య మభినయింతురు)

జిజా—ఇదిగో! అదృష్టము! ఆయు ష్మంతుడు శివకుమారుడే!
(వతీయును)

సోయేరా—(ఆనందముతో నమస్కరించును)

శివా—(తల్లికి నమస్కరించును)

జిజా—దీర్ఘాయుష్మాన్భవ. నాయనా! వత్స శంభాజీ కు
లియేకదా!

శివా—అమ్మా! దేవి కృపచేత భద్రముగనే యున్నాడు.

బ్రాహ్మ—అయ్యా! శివకుమార! మీరు ఢిల్లీకి వెళ్లి మొదలు మీ సామ్రాజ్యమకుటము దేవియొద్దనే యుంచబడినదికదా తిరిగి మీ సామ్రాజ్యమును మీరు దేవియెదుటనే ధరించతగినది.

(దేవియెదుట నున్న కిరీటమును తీసి శివాజీ శిరమున నుంచును)

జిజా—నాయనా! మలకలనుండి వదలి తిరిగి నీ సామ్రాజ్యమును నీవు చేకొంటివి కాన నిక నాకు చింత లేదు.

బ్రాహ్మణు—మహారాజా! పూర్ణముగ నామావశేషమై మహారాష్ట్రరాజ్యమును తిరిగి సంస్థాపనము జేసి గోబ్రాహ్మణసా పరిపాలక శివచ్ఛత్రపతి యను బిరుదముల నందిన నీ కింక నేమి కా అయును.

శివా—భూసురవర్యా! సకలాభీష్టసంధాయినియైన భవా కరుణకు నేను పాత్రుడనై యున్నపుడు నా కెందును గొరంత లేదు. అయిన నిట్లగు గాక.

గీ. జాతి మత వైరములు లేని • శాసనములఁ
బాలనము సేయుదురుగాత • ప్రభులు భువిని
గోవులును మానినీమణుల్ • క్రూరబాధ
దొఱఁగి సుఖయింత్రుగాత సం• తోషముగను.

(అందరు నిష్క్రమింతురు)

ఇది

శ్రీమత్కాశ్యపగోత్రోద్భవ శ్రీచక్రావధాని వంశసుధాబ్ధి సుధాక
ర నరసింహాభిధాన తనూభవ నరసమాంబాగర్భశుక్తి
ముక్తాఫల శ్రీకోణకంచి వేంకట సుబ్బరాయ
గురు కరుణాలబ్ధసాహిత్య విబుధవిధేయ
మాణిక్యశర్మ
ప్రణీతంబైన
మహారాష్ట్రవిజయమునందు
సర్వము
సంపూర్ణము.